# అధిక దిగుబడికి అధిక పోషణనిచ్చే ఎరువులు ముఖ్యం

గ్రోమోర్
**14-35-14**









గ్రోమోర్
**28-28-0**

చేనుకు చేవ, రైతుకు రొక్కం-గ్రోమోర్




కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్

AIYARS CF 479 TL

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాడు సీరియల్‌గా
ప్రచురింపబడి మీ మన్ననలందుకొన్న నవల—
నేడు చలన చిత్రంగా రూపొందింది!

ప్రతి తండ్రీ—కొడుకూ
తల్లీ—కూతురూ తప్పక చూడవలసిన
కుటుంబ సమస్యా చిత్రం!




# అనగనగా ఒక తండ్రి

దర్శకత్వం: సి. యస్. రావు. ... కథానిర్మాత: మహేష్
సంగీతం: చక్రవర్తి, కెమెరా: జి. కె. రాము,
ఆంధ్రా విజయా కంబైన్సు, ... విజయలక్ష్మి పిక్చర్సు, ... జనతా పిక్చర్సు, ... చిత్ర

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం 5-7-'74
శ్రీఆనందనామ సం ఆషాడమాస బ పాడ్యమి
సంపుటము 67 సంచిక 45
స్థాపితం : 1908
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం విజయవాడ-3

సంవత్సరం చందా - రు 31-20 పై
ఆరుమాసాల చందా - రు 15-60 పై
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక





పై వారమే
కొత్త సీరియల్

# ఉత్తరాలు

### ముఖచిత్ర

మా అభిమాన నటి "మంజుల" ముఖచిత్ర మును వేసినందుకు మాకు కలిగిన ఆనందమును ఈ చిన్న గేయరూపములో వ్యక్తపరుస్తున్నాను తప్పక ప్రచురించెదరని ఆశిస్తున్నాను

"మంజుల ! ఏమని వర్ణించను నీ అందము
నీ మీన లోచనముల కాంతి,
నీ చిరునవ్వుల వెన్నెలలు,
కురిపించినవి మా హృదయములలో
ప్రేమామృతపు జల్లులు"

మంజుల ముఖచిత్రము కొరకు చకోరపక్షులవలె ఎదురు చూసిన మాకు సంతృప్తి నిచ్చిన పత్రికా సంపాదకా !

అందుకో మా కృతజ్ఞతాభి వందనములు

ఏ బి సురేష్ బాబు, (మదనపల్లి)

### కథలు

14-6-'74 సంచికలో నా 'తాత -మనవడు' కథ ప్రచురించినందుకు థాంక్స్! కాని, ఆర్టిస్టుగారి పొరబాటువల్ల, నా పేరు పి వి ఆర్ శివకుమార్‌కు బదులుగా, పి వి ఆర్ కుమార్ అని ప్రచురించ బడ్డది !

దయచేసి రాబోవు సంచికలో దీనా పొరబాటుకు సవరణగా నా పూర్తిపేరు ప్రకటించ కోరతాను

పి వి ఆర్ శివకుమార్, హైదరాబాదు

### హైదరాబాద్ నోట్ బుక్

7-6-74 సంచికలో తిరుమల రామచంద్ర గారు, రైల్వేలో సమ్మె గూర్చి ప్రస్తావిస్తూ, వు సమ్మెలు జపాన్ కార్మికుల సమ్మెలా వుంటే బావుండునేమో అని రాశారు కాని "మన ప్రభుత్వం జపాన్ ప్రభుత్వంలా వుంటే, బావుండునేమో" అని రాసివుంటే సబబుగా వుండేది ఉత్పత్తిని నిలుపు చేస్తేనే ఉచ్చరించని ఈ ప్రభుత్వం, ఉత్పత్తిని అత్యున్నతస్థాయిలో పెంపొందిస్తే పలకరిస్తుందం టారా ?

ఎమ్. భానుమూర్తి (కాశీబుగ్గ)

7-6-74 సంచికలో శ్రీ కల్లూరి వాసుదేవ రావుగారి లేఖ చదివి ఈ జాబు వ్రాయాలనిపించి నది

దక్షిణ భారతీయులు అభివృద్ధి చెందక పోవ టానికి కారణం రాజకీయ ప్రాబల్యమే

(1) స్వాతంత్ర్యము దగ్గరనుంచి ప్రధానమంత్రి పదవి ఉత్తర భారతీయుల చేతిలోనే ఉన్నది (ద్రవిడ కళగం స్థాపకుడు ఇ వి. రామస్వామి నాయకర్ (పెరియార్) బ్రతికిఉంటే ఈ సమ యానికి ఆందోళన జరిపే వారేమో ప్రధానిగా దక్షిణాదీయుడు కావాలని)

(2) రాష్ట్రపతిగా దక్షిణ భారతీయుడు పద విని చేపట్టినా వారు పేరుకే

### మనలో మాట

ఈ వారంతో 'బంగారు కలలు' అయిపోయింది కాని 'చిదంబర రహస్యం' మొదలైంది ! పై వారం నుంచి 'అన్నపూర్ణ' సీరియల్ నవల ప్రారంభం అవుతుంది

* * *

రచనలు పంపేవారు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికలలో అప్పుడప్పుడు వేస్తూవున్న నిబంధనలను ఒకసారి చదివి పంపటం మంచిది నిబంధనలు విడి విడిగా లేఖలద్వారా తెలియజేయడం సాధ్యంకాని పని

లోగడ ముద్రితమైన, లేక ప్రసార మైన రచనలను, తమ స్వంతమే అయినా మా పరిశీలనకు పంపరాదని రచయితలకు ప్రత్యేకంగా మనవి చేస్తున్నాము

### సినిమా

సినిమాలు నడవడానికి భాషతో ప్రమేయం లేదంటూ వ్రాసారు భువనేశ్వరం పాఠకులిద్దరు 3-5-74 సంచికలోని నా లేఖ చదివి అటు వంటప్పుడు అంతర్జాతీయంగా పేరుపడ్డ మలయాళ, వంగ చిత్రాల వాసన మన రాష్ట్రాలలో లేక పోవడా నికి కారణం ? మన తెలుగు చిత్రాలు కుటుంబ గాథలతోనూ, ఇంకా వేటపోటీలతోనో నిండి ఉం టాయి అందువలన చాలా బోర్‌గా ఉంటున్నాయ్ అని పాపం వారి బాధ ! మక్కికి మక్కి ఆ చిత్రాలే హిందీలో వచ్చి ఎంత దర్జాగా ఆడుతున్నాయో చూస్తు న్నాం బాగున్నాయని చెప్పుకుంటున్నాం, 'జ్వార్ భాటా, ఇన్సాఫ్, షెరిఫ్ ఇన్సాఫ్, ప్రేమ్‌నగర్' మొదలగునవి "మనింటి కూరలని" వారికి తెలియ దేమో! యం, యస్, వి జి. రాజు, (కటక్)

(3) తెలుగువారి మధ్య అపోహలను రెచ్చకొట్టి ఉక ఉద్యమానికి కీలకపాత్ర వహించినవారు ఉత్తర భారతీయులు

(అ) దక్షిణాదిలోనున్న పెద్ద నగరాలలో టోకు వ్యాపారం మరియు వడ్డీ వ్యాపారం చేస్తున్నవారు ఉత్తర భారతీయులు

(ఆ) దక్షిణాదిలోనున్న ఉత్తర భారతీయులు మొత్తం దక్షిణదేశం కొనగల ఆర్థిక స్తోమత కల వారు

(4) దక్షిణాదిలోనున్న ఒకటి, రెండు పెద్ద కర్మాగారాలు కేంద్ర ప్రభుత్వం స్థాపించింది కూడా తమిళనాడు ప్రభుత్వం వల్లనే

మల్లెల విజయకుమార్ (మద్రాసు)

# హైదరాబాద్ నోట్ బుక్

**తిరుమల రామచంద్ర**

## రోడ్ల అభివృద్ధి

వచ్చే ఏడాదినుంచి రోడ్ల అభివృద్ధికి పంచదార సెస్సులో యాభై శాతం కేటాయించడానికి ప్రభుత్వం నిర్ణయించిందని రోడ్లు, భవనాల శాఖామంత్రి శ్రీ హెచ్ వెంకట్రావు జూన్ 5 న రోడ్ల అభివృద్ధి సంఘం సభలో ప్రకటించడం మన రాష్ట్రంలో రోడ్ల దుస్థితిని చూస్తున్న వారందరికీ ఆనందం కలిగించక పోదు ఇరుగు పొరుగు రాష్ట్రాలలో రోడ్లు చూస్తే నా మటుకు నాకు కడుపు మండుతుంది. ఎంత బాగున్నాయో అని మన రోడ్లు బాగుండక పోగా వెడల్పు తక్కువ కానీ, ఎక్స్‌ప్రెస్‌లకు సూపర్ ఎక్స్‌ప్రెస్సులకు తక్కువ లేదు రోడ్లు చిన్నవి కావడం వల్ల ఎదుట వస్తున్న ప్రతి అడ్డమైన దానికీ సైడిస్తూ పోయే మన ఎక్స్‌ప్రెస్ బస్సులు గురికి బారెడు దూరం అన్నట్టు రెండు గంటలు మూడు గంటలు ఆలస్యంగా రావడం, రైలు చార్జీకన్నా హెచ్చు రూకలు చెల్లించి త్వరగా గమ్యం చేరుకుందాము రైలుకన్నా ముందుగా అని ఆశించే ప్రయాణీకులు ఉసూరుమనడం నిత్య దృశ్యాలు ఉదాహరణకు హైదరాబాద్ నుండి మద్రాసుకువెళ్లే సూపర్ ఎక్స్‌ప్రెస్‌నే తీసుకుందాం అది సకాలంలో గమ్యం చేరిన పాపాన సంవత్సరంలో ఏ రెండు సార్లో పోయి వుంటుందేమో! కనుకరోడ్ల అభివృద్ధి విస్తృతీకరణ, దృఢీకరణ — అవసరం అంతేకాక జాతీయార్థిక పరిశోధన మండలి అన్నట్లు రోడ్ల పై కోటిరూపాయల పెట్టుబడి పెడితే దాదాపు 12 వేల మందికి ఉద్యోగ కల్పనఅవుతుంది అంటే కొత్త రోడ్ల పైన అన్నమాట పాతరోడ్ల పై మరమ్మతు మొదలయిన వాటికి కోటి రూపాయల పెట్టుబడి అదనంగా నాలుగు వేలపైచిలుకు మందికి వృత్తినిస్తుంది ఎన్నో కరవు పనులలో రోడ్లు పోయడం చేర్చడం మనందరికీ తెలును రోడ్ల ప్రాముఖ్యం ఇలాటిది కనుకనే అశోకుడు, శాతవాహనులు రోడ్లు వేయించడం

## తస్మాత్ జాగ్రత్త!

**1972 సెప్టెంబరులో రాష్ట్ర శాసనసభలు ఆమోదించిన కమతాల గరిష్ఠ పరిమితి చట్టం 1973 లో రాష్ట్రపతి ఆమోద ముద్ర పొందినా ఇంతవరకు అమలు కాక పోగా, 1975 ఏప్రిల్ వరకు వాయిదా పడే ప్రమాదం వుందని ఒక రాజకీయ పక్ష నాయకుడు నాతో అంటూ, అలాటి అవకాశాన్ని ప్రతిపక్షాల వారు, తీవ్రవాదులు దుర్విని**

(42 వ పేజీ చూడండి)





# చిదంబర రహస్యం

*చిదంబర రావుకు అద్భుత శక్తులున్నాయనీ సాయంత్రమైతేచాలు అశోకవర్ధన హాస్టల్‌లో ఒక్క 'లా' స్టూడెంటూ ఉండడనీ అంతా అప్ లాండ్స్‌లో నరసంచారానికి దూరంగా వెళ్లి పోతారనీ విని ఆశ్చర్య పడ్డాను. నాకెందుకో ఈ మంత్ర తంత్రాల మీదా, మానవాతీత శక్తుల మీదా అంత నమ్మకం లేదు. ఇవన్నీ ఏవో పల్లెటూళ్లలో విద్యా సంస్కారం అంతగా లేనివాళ్లు నమ్మే విషయాలేనని నేననుకుంటూ వుండేవాడిని. కాని ఇప్పుడిలా విశ్వ విద్యాలయంలో చదివే మేధావులంతా కూడా నమ్ముతున్నారంటే నాకూ నమ్మక తప్పలేదు. నూటికి తొంభై మంది నమ్ముతుంటే నేనొక్కడినీ నమ్మకుండా ఎలా వుండటం?*

చిదంబరరావును గురించి విన్న విషయాలు సామాన్యమైనవికాదు. అతడు 'బాణామతి' అనే పేరుగల భూతవైద్యం చేస్తాడు. జాలారిపేటలో కొన్ని దయ్యాలను పట్టి సముద్రంలో కలిపేశాడు. పీతలవానిపాలెంలో ఒక జాలరికి బంగారపు చేపను నీళ్ళల్లో నుండి తీసియిచ్చాడు! ఆ చేప ముందు మానవభాషలో మాట్లాడిందట. తరువాత విలవిలలాడి కిందపడి పోయింది. కరిగిస్తే చేప మొత్తం బంగారమే? !!

చిదంబరరావుకు వశీకరణ శక్తులున్నాయి. ఏ విద్యార్థినయినాసరే చూపులతోనేఆకర్షించ గలడు. అతడు చిరునవ్వు నవ్వితే చాలు ఆడపిల్లలంతా ముఖాలను హారతి పళ్లాలలా, చేసుకొని నిలబడతారు. అతనంటే యూనివర్సిటీ ప్రొఫెసర్సుకు కూడా గౌరవమే. ఫలానా ప్రొఫెసరుకు ఫలానా దేశం నుండి ఆహ్వానం వస్తుందని జోస్యం చెపుతాడు. అంతే! నెలతిరక్కుండా, వచ్చి తీరాల్సిందే! 'నీవు ఇన్నాళ్లల్లో రీడరువు కాబోతున్నావ'ని చెబుతాడు–అలా జరిగితీరాల్సిందే !! 'ఫలానా ప్రొఫెసరుకు అంగారక గ్రహం బాగాలేదు–ఈ గండం గడవటం కష్టం' అని చెపుతాడు. చెప్పినతేదీ మళ్లీ వచ్చేలోపలే ఆయన గుండెపోటుతో 'హరీ' మనడం నాకూ తెలిసిన విషయమే! ఇక నమ్మకుండా వుండటం ఎలా.?

ఇంత జరిగినా సరే, నా జన్మ సంస్కారాల ఫలితంగానో ఏమోమరి ఇదంతా చిదంబర రహస్యమేననిపించింది. వాడేదోమోసం చేస్తున్నాడనిపించింది. సామాన్య జనులనే కాదు విద్యావంతులనే బోల్తా కొట్టిస్తున్నాడనితోచింది. ఇది ఎలాగైనా సరే నిరూపించాలి. నలుగురిలోనూ చిదంబరరావు గుట్టు మట్టుచేసి నవ్వులపాలు చేయాలి– అప్పుడే నాకు రిలీఫ్–ఈ నిశ్చయం బాగానేవుంది. మరి నిరూపించడం ఎలా? నామటుకునాకే ఇంకా పూర్తిగా సంశయ నివృత్తికాకపోయె. ఎలా చిదంబరరావు దగాకోరని ఇతరులచేత నమ్మించడం??.

పులిమీద పుట్ర అన్నట్లు నా క్లాస్‌మేట్ రాజేంద్ర చెప్పిన విషయం నాలో ఇంకా భయాన్ని రేకెత్తించింది. చిదంబరరావు మోసగాడని నిరూపించే ఉద్దేశంతో ముగ్గురు లాస్టూడెంట్స్ అతనిపై గూఢచారి చర్యలు మొదలుపెట్టారట. 'వాడి అంతుతేలుస్తాము– ఈ బి.సి. నాటి మూఢ నమ్మకాలతో పవిత్ర విశ్వవిద్యాలయ ఆవరణాన్ని అపవిత్రం చేస్తున్నాడు' అని హేతువాదంతో పురోగమించారట. నీడలా చిదంబరరావును అనుసరించారట.

అది చిదంబరరావుకు తెలిసింది. ఆయనేమీ అనలేదు. కేవలం ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. 'వాళ్లనలా వదిలేశారేం' అని చిదంబరరావు భక్తులు ఎవరో అంటే 'పోనిద్దూ మతిలేని వెధవలు – వాళ్లతో మనకెందుకు' అన్నాడట. అంతే! అవి, వారం తిరగలేదు. ఆయన మాట మంత్రమై పారింది – వేములవాడ భీమకవి కున్నట్లు వాక్శుద్ధి వున్నదో ఏమో మరి ఆ ముగ్గురు స్టూడెంట్స్‌కూ మతి చలించింది. రాత్రికి రాత్రే వాళ్లను యూనివర్సిటీ గోడ అవతలకి చేర్పించవలసి వచ్చింది. కాంపౌండ్ కవతల సుప్రసిద్ధమైన పిచ్చి ఆసుపత్రి వున్నది. వాళ్లనక్కడ వదిలేయక తప్పలేదు!!

దీనితో నేను నా ప్రయత్నాన్ని దాదాపు విరమించుకున్నట్లే లెక్క. చిదంబరరావు ఏమైతే ఎవడికి కావాలి? నేను మా అమ్మా–నాయనలకు ఒక్కడే బిడ్డణ్ణి. వెనకాల పెద్ద ఆస్తిపాస్తులూ లేవు. రెక్కల కష్టంమీద చదివిస్తున్నారు. అనవసరంగా ఇప్పుడు నాకు మతి చలిస్తే వాళ్లగతేంకాను? ఈ చిదంబర రావు గొడవతో నాకేమిపని?? నేనిక్కడికి వచ్చింది ఎం. ఎస్. సి లో ఫస్టుక్లాసు సంపాదించుకొని వెళ్లడానికి. అదితప్ప ఇంకొక ధ్యాస నాకెందుకు?

ఇలా అనుకొని చిదంబర రావు గూర్చి ఇక ఆలోచించడం మానివేశాను.

* * *

ఆ రోజు సాయంత్రం నేను సముద్రం ఒడ్డుకు వెళ్లాను. కెరటాలు ఎగిరెగిరి తీరాన

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

వున్న బండరాళ్లకు కొట్టుకుంటున్నవి నా మనస్సులాగా. రంగు రంగుల గవ్వలేరుకుంటూ ముందుకు సాగిపోతున్న నన్ను ఎవరో పేరు పెట్టి పిలిచినట్లనిపించింది

'కిరణ్ కుమార్! ఓయ్ కిరణ్ కుమార్'

వెనుదిరిగి చూచాను —

దూరంగా చిదంబర రావు !!

ఉలిక్కిపడ్డాను.

చిదంబర రావు ఒంటరిగా సముద్రం ఒడ్డున కూర్చొని వున్నాడు. ఆయనను చూడగానే నాకెందుకో గుండె దడదడ కొట్టుకున్నది — కాళ్ళు బలహీనంగా అయిపోయి నేలమీద గట్టిగా మోపి నిలబడలేక పోతున్నట్లు అనిపించింది.

దూరం నుంచి చిదంబరరావు నన్ను రమ్మని చెయ్యూపుతున్నాడు —

యాంత్రికంగా చిదంబరరావు వైపు నడిచాను

కాళ్లలో సత్తువలేదు—కళ్లల్లో చైతన్యం లేదు.

## ప్రారంభం!

ఏదో "దంష్ట్రా కరాళుడి విషజిహ్వాల పైకో" నడిచి పోతున్నట్లనిపించింది—

ఎలావెళ్లానో నాకే తెలియదు—

వెళ్లి చిదంబరరావు కెదురుగా నిలబడ్డాను

చిదంబరరావు నన్నుచూచి నవ్వాడు—

నవ్వాడు !!

ఇంకేం నాపనీ అయిందన్నమాటేనా ?

నాకు ఏడుపు వచ్చింది—

ఏడ్చానా ? ?

మరీ పసిపిల్లవాణ్ణి కాదుకదా పెద్దగా ఏడ్వడానికి—ఎం. ఎస్. సి. చదువుతున్నవాణ్ణి —ఎదిగినవాణ్ణి—సభ్యసమాజ లక్షణాలు పట్టుపడ్డవాణ్ణి—అందుకే లోలోపలే ఏడ్చాను—

'కూర్చొండి కిరణ్ కుమార్ నిలబడ్డారేం'

ఆ మాటలు చాలా ప్రశాంతంగా వున్నాయి. మంత్రరుద్ధ భుజంగంలా ఆయన ఎదుట కూర్చున్నాను. చిదంబరరావు ముఖంలో ఏదో విలక్షణమైన శాంతివుంది. మాటల్లో ఏదో సమ్మోహన శక్తి వుంది.

'షికారుకు వచ్చినట్లున్నారు.'

'అవును-'ఆయన కళ్లల్లోకి చూస్తూ అన్నాను.

'ఇవ్వాళ సముద్రం ఎందుకో ఎర్రగా వుంది'

'అవునండి'

'కిరణ్ కుమార్ నీకు ప్రకృతి అంటే ఇష్టమేనా'

ఇష్టమో కాదో నేనెప్పుడూ ఆలోచించలేదు-తిండిగూర్చి, గుడ్డగూర్చి, డిగ్రీల గూర్చి ఆలోచించేనే కాని ప్రకృతి ఇష్టమా కాదా అని ఎప్పుడాలోచించాను? ఎందుకాలోచించాలి??

'నీవు పుట్టిన కొల్లేరుచుట్టు ప్రక్క అంతా ప్రకృతి ఎంతోమనోహరంగావుంటుంది కదయ్యా. విశ్వనాధ సత్యనారాయణగారి హృదయం ఉప్పొంగి ఋతుసంహారం అనే పుస్తకం కూడా వ్రాశాడుకదా ఆ సౌందర్యం



చూచి. శరత్కాలంలో అక్కడి కొంగలు పైకెగరడంపై అందమైన సీస పద్యాలు వ్రాశాడు' నేను స్తంభించిపోయాను—ఆయన కున్న సాహిత్య పరిచయానికి కాదు, నాది కొల్లేరుదగ్గర గ్రామమని ఈయనకెలా తెలుసు?? నా పుట్టు పూర్వోత్తరాలూ జాతకమూ మొత్తం ఫైలులో పెట్టుకున్నాడా ఏమిటి??

ఆయనే మళ్లీ అన్నాడు' చూడు కిరణ్ నువ్వు విజయవాడలో బి. ఎస్. సి. ఫస్టు క్లాసులో పాసైనావు—గోల్డ్ మెడల్ కూడా సంపాదించావు నిజమేకాని చదువంటే పుస్తకాలేనా? గ్రంథాలకు ఇవతల చాలా ప్రపంచం వుంది—అందులో చదువవలసిన విషయాలూ నేర్చుకోవలసిన పాఠాలూ గుణపాఠాలూ ఎన్నో వున్నాయి.''

సందేహంలేదు — నా చదువు సంధ్యలూ గోల్డ్ మెడల్ రావడమూ మొత్తం ఈయనకు తెలుసు.

అకస్మాత్తుగా రెండు చేతులతోనూ చిదంబరరావు పాదాలు ముట్టి కళ్లకద్దుకున్నాను—

'ఇదేమిటి? నీకేమన్నా పిచ్చా? నాకు దణ్ణంపెడతా వేమయ్యా.'

'చిదంబరరావుగారూ మీరు సాక్షాత్తు దైవాంశ సంభూతులు — ఇన్నాళ్లూ, వాళ్లూ వీళ్లూ చెపుతూంటే నమ్మకం కుదరలేదు—'

'దైవంలేదూ అంశం లేదూ కిరణ్ — అంతా తమాషా—నీ మిత్రులు చాలా మంది నాకూ మిత్రులు — వాళ్లు చెవుతుంటారు నీ గూర్చి అంతే'

అబద్ధం! నేను నమ్మను -

ఆయనే అన్నాడు 'ఈ లోకం చాలా

# చిదంబర రహస్యం

విచిత్రమైనదయ్యా — మనిషిని మనిషిగా గుర్తించలేదుకాని నిమిషాలమీద మనుషులను దేవతలకిందకు మారుస్తుంది — తమాషాగా లేదూ?'

'తమాషా ఏమిటిస్వామీ — మీ మహాత్మ్యాలూ, మానవాతీత శక్తులూ నేను విన లేదనుకున్నారా ఏమిటి—'

'కిరణ్ — మరీ పెద్ద పెద్ద మాటలు వాడకు. మీ అందరి వ్యవహారం చూస్తే నన్నిప్పుడే ఏ సన్యాసాశ్రమంలోకో పంపేటట్లుంది — నేనూ మీలాంటి స్టూడెంటు నేనయ్యా — కాలేజీ విద్యార్థిని — కాకుంటే ఆలస్యంగా చదువు మొదలు పెట్టడంవల్ల వయస్సులో కొంత పెద్దవాణ్ణి అంతే — స్వామీ ఏమిటి స్వామీ, గామీ — ఎవడన్నా నవ్వుతాడు—'

'నవ్వుతాడు కాదు స్వామీ నమ్ముతాడు—మిమ్మల్ని చూస్తుంటేనే దైవాంశ సంభూతులని ఎవడైనాసరే గుర్తించి తీరుతాడు—'

'మీ పిచ్చికి నేనేం చెప్పను?'

ఈ 'పిచ్చి' అనే మాటకు త్రుళ్లిపడ్డాను—నా 'పిచ్చి'ట!

'స్వామీ, మీరు తమాషాకు కూడా పిచ్చి—గిచ్చి ఇలాంటి మాటలు వాడకండి—సన్మార్గంగా చదువుకొని అభివృద్ధిలోకి రావాలని ఆశీర్వదించండి'

చిదంబరరావు నవ్వాడు—తమాషాగా నా వీపు చరిచి 'పోదాంపద' అన్నాడు.

నేనూ ఆయన వెంటే లేచినిలబడ్డాను.

చిదంబరరావు ముందూ నేను వెనుకా—

నేను అడగకుండానే చిదంబరరావు తన గూర్చి చెప్పుకున్నాడు. ఆయనది గోదావరి జిల్లాలో ఓచిన్న గ్రామం. చిన్నప్పటి నుంచీ గ్రామ రాజకీయాలలో పాల్గొనడంవల్ల చదువు సంధ్యల గూర్చి అంతగా పట్టించుకోలేదు—ఏదో భుక్తికి ఇంత వుండటంతో వెంటనే ఉద్యోగం చేసే అవసరంకూడా లేకపోయింది. వయస్సు పెరిగేకొద్దీ కుటుంబ బాధ్యత నెత్తిన పడేకొద్దీ ఏదైనా సంపాదనా మార్గం వుండక తప్పదనిపించింది—లాలోచేరి మంచి మార్కులుతెచ్చుకుంటే ఎక్కడైనా మునిసిఫ్ మేజిస్ట్రేట్ గా అప్పాయింట్ కావచ్చు—లేదా ఏలూరులోనో రాజమండ్రిలోనో బోర్డు తగిలించవచ్చు—ఈ ఉద్దేశంతో చదువులో చేరాడట—ఆయన చేరి అప్పుడే సంవత్సరం గడిచింది—ఇది రెండో యేడు.

నేను మాత్రం ఈ ఎకడమిక్ ఇయర్‌లోనే చేరాను— అందుకని నాకిది మొదటిసంవత్సరం

'అయితే స్వామీ...'

'హుష్—పేరు పెట్టి పిలువు కిరణ్ -'

'అలాగే — ఇంతకూ మీకీసిద్ధులు ఎలా అలవడ్డాయి?'

'ఏ సిద్ధులు?'

'అవే మంత్ర తంత్రాలూ —మానవాతీత శక్తులూ—'

చిదంబరరావు మళ్లీ నవ్వాడు —

'ఇదుగో—అలాంటి మాటలు మళ్లీ అనకు —ఎవడన్నా వింటే బాగుండదు'

నేను మౌనంగా వూరుకున్నాను—

యూనివర్సిటీ గేటు వచ్చింది—మళ్లీ జన సంచారం బయట కిళ్లీ దుకాణాలవద్ద విద్యార్థులు కొందరు చిదంబరరావును చూచారు.

'గురూజీ—గురూజీ — వ్యాళ్లోకి హారర్ ఆఫ్ డ్రాకులా వచ్చింది—వెళ్దామా?' ఎం. పి. పాత్రో సిగరెట్ పొగలతో మేఘాలు సృష్టిస్తూ వచ్చాడు—అతని వెంటనే వినోద్ చటర్జీ, స్వామి; కూడా వచ్చారు.

'అవునోయ్ క్రితంసారి వచ్చినప్పుడు కూడా చూడలేదు — మిస్‌అయినాం — అని నావైపుచూచి 'కిరణ్ — ఇట్టివెళ్లి భోజనం ముగించుకొని మా రూం దగ్గరికిలా పోదాం' అన్నాడు చిదంబరరావు.

నేను అలాగేనని తలవూపి మెస్‌కు అభిముఖంగా నడక సాగించాను.

చిదంబరరావుకు నా మీద అభిమానం ఏర్పడుతున్నది.

అందులో అనుమానంలేదు.



# రక్షామణిలక్షణం



—ధర్మపథం—

బులుసు వెంకటరమణయ్య

భక్తులు భగవంతుణ్ణి స్తుతించేటప్పుడు 'లోకరక్షామణీ! ఆర్త రక్షామణీ! దీనచింతామణీ!' అనే రీతిని చెప్పడం సర్వ సాధారణం.

చింతామణి సంగతి సుప్రసిద్ధం! అది కోరిన కోరికలను ఇచ్చే మణి అని చాలామందికి తెలిసిన సంగతే!

''రక్షామణి'' అంటే రక్షించే మణి అని అర్థం అవుతుంది. 'లోక రక్షామణి' లోకాలను రక్షించేది; ఆర్త రక్షామణి బాధలలో ఉన్న వారిని రక్షించేది.

కేవలం దేవిని గురించే కాకుండా ప్రజలను పాలించే రాజులను కూడా ఈ సంబోధనతో పిలవడం కానవస్తున్నది. రాజు భగవదంశ సంభూతుడనే అభిప్రాయం ఉండబట్టి ఇలా చెప్పబడి ఉండవచ్చును.

చింతామణికి కోరిన కోర్కెలు నెరవేర్చే శక్తి ఉన్నట్లే రక్షామణికిన్నీ కొన్ని శక్తులు ఉన్నవి.

'యస్తం బిభర్తి మనుజాధిపతిర్న తస్య
దోషా భవంతి విషరోగకృతాః కదాచిత్,
రాష్ట్రే చ నిత్య మభివర్షతి తస్య దేవః
శత్రూంశ్చ నాశయతి తస్య మణేః
ప్రభావాత్.'

అని ఆ రక్షామణిని గురించి ఒక శ్లోకంలో చెప్పబడింది.

'రక్షామణిని ధరించిన రాజు దోష రహితుడై ఉంటాడు. ఏవిధమైన విషంవల్లగాని, రోగంవల్లగాని, అతనికి అపాయమేమీ ఉండదు. అతడు పాలించే దేశంలో సస్యానుకూలంగా వర్షాలు పడి, దేశం సుభిక్షంగా ఉంటుంది. ఎవరైనా శత్రువులు అతనిపైకి వచ్చారంటే అపజయాన్నే పొందుతారు. ఆ మణియొక్క ప్రభావం అటువంటిది!' అని దీని అభిప్రాయం.

ఈ మణులు సులభంగా లభ్యమయేవి కావు. ఎంతో అదృష్టశాలికిగాని లభించవు.

కొన్ని కొన్ని దోషాలు పోవడానికి వేర్వేరు మణులు ఉంగరాలు మొదలగు ఆభరణాలలో ధరించడం ఇప్పుడుకూడా ఉన్నది.

దీనిని బట్టిన్నీ మణులకు విలువ హెచ్చుతుంది.

---

నేనే ఇంకా ఆయనతో సరిగ్గా మాట్లాడ టంలేదు—

మహాత్ములను నమ్మాలి—అంతేకాని 'మీకీ మానవాతీత శక్తులు ఎలావచ్చాయి? అని ప్రశ్నలు వేయడం తప్పు—

ఇకనుంచి జాగ్రత్తగా మాట్లాడాలి.

సినిమాకు రమ్మన్నాడు సరేకాని రాత్రి ఒక చాప్టర్ ఫినిష్ చేద్దామనుకున్నానే— ఎలా ??

నా వెర్రికాని చిదంబరరావు గట్టిగా సంకల్పిస్తే ఇలాంటి పరీక్షలొక లెక్కా? యూనివర్సిటీ ఫస్టు దెబ్బకు ఇప్పిస్తాడు— ఆయన తలుచుకుంటే రికార్డుబ్రేక్ కూడా చేయింపగలడు నాచేత—

ఈ విశ్వాసం బాగానే వుంది—

అదే నిజమయితే ఆయన ఎందుకు ఫీజు కట్టి రోజూ క్లాసులకు వెళ్తున్నాడు ??

చదవకుండా మంత్రతంత్రాలతో డిగ్రీలు సాధించవచ్చా ?? నా మనస్సుకేమీ పాలు పోలేదు—

అంతా గందరగోళంగా వుంది—

కాళిదాసు నాలుకమీద దేవత బీజాక్షరాలు వ్రాసిందనీ దాంతో ఆయన మహా కవిత్వం చెప్పడం మొదలు పెట్టాడనీ 'మాణిక్యవీణాం' అంటూ రసవంతమైన దండకం ప్రారంభించాడనీ కథ. ఇలాంటివి ఇంకా ఎన్నో వున్నాయి మన చరిత్రలో పురాణాల్లో— వీటి నన్నింటినీ నమ్మకుండా కొట్టిపారేయడం ఎలా ??

ఈ ఆలోచనా ప్రవాహంలో నేను మెస్‌కు వెళ్లడం భోజనం చేయడం తిరిగి సద్ధర్మ సదనలో నా రూంకు చేరడంకూడా అయింది.

జేబులో ఓ పది రూపాయల నోటు పెట్టుకొని వెంకటరెడ్డికి చెప్పాను సినిమాకు వెళ్తున్నానని. ఆయనదీ మా వూరుదగ్గరే ఓ గ్రామం. ఇరువురం విజయవాడలో కూడా క్లాసు మేట్సుము. కావాలని ఒకే రూంలో వేయించుకున్నాము—

వెంకటరెడ్డి వింతగా నన్ను చూచి అన్నాడు.

'ఇదేం దబ్బా! తమాషగుండదే! నువ్వేంటి ? సినిమా కెళ్లడమేంటి ??'

చిదంబరరావు రమ్మన్నాడని చెప్పడమా వద్దా? అని ఆలోచిస్తున్నాను—

'ఏం పిక్చరు?'

'హారర్ ఆఫ్ డ్రాకులా'

'ఇదుగో కిరణూ—అట్టాంటి సినిమాలు చూడకయ్యా, నీ పుణ్యముంటుంది. దయ్యాలూ భూతాలూ ఏం సినిమాలవి—

నేనేం జవాబివ్వలేదు—మెల్లగా చిదంబర రావు గదికేసి నడిచాను. నిజానికి రెండో ఆట సినిమాకు బయలుదేరడం నా జీవితంలో ఇదే ప్రథమం.

నేను చేరేటప్పటికే చటర్జీ, స్వామి, చిదం బరరావు గదిముందు కుర్చీలు లాక్కొని కూర్చొని బాతాఖానీ కొడుతున్నారు—ఇందులో స్వామి అందరికీ తెలిసినవాడే—గత సంవత్సరం ఎన్నికల్లో పోటీచేసి ఓడిపోయాడు— ఆయన ఖర్చుపెట్టినంత డబ్బు ఎవరూ పెట్టలేదని అంటారు.

'చిదంబరరావుగారు లేరా'పస్తూనే ప్రశ్నించాను.

'రా బ్రదర్—రా— ఆయన లోపల పూజ చేసుకుంటున్నారు—ఓ పదినిమిషాల్లోవస్తారు' అని నాకో కుర్చీ చూపి మళ్లీ వాళ్లబాతాఖానీలో వాళ్లుపడ్డారు.

ఇంత ఆధునిక యుగంలో యూనివర్సిటీ హాస్టల్‌లో ఈ పూజలూ పునస్కారాలూ— ఏమిటిది ??

నమ్మశక్యం కాకుండా వుంది—

కాసేపటికి గది తలుపులు తీసి చిదంబర రావు వచ్చాడు గదినిండా సాంబ్రాణికడ్డీల

ఘుమఘుమలు—చిదంబరరావు వస్తూనే నన్ను చూచి నవ్వాడు.

'భోజనం అయిందా కుమార్'

'అయిందండీ'

'మీరు రా'

'మాకు ఆకలిగా లేదు గురూజీ — సాయంత్రం హెవీ టిఫెన్ పడింది. థియేటర్ దగ్గర టీ తగిలిస్తే సరి.'

చిదంబరరావు కుర్చీలో కూర్చున్నాడు.

సంభాషణ నిరుద్యోగ సమస్య ప్రస్తుత విద్యావిధానం ఇలాంటి అంశాల మీదికి సాగింది —

ఆయన మంచి మాటకారి అని నేను గమనించాను —

తాను చెప్పే ప్రతి విషయం గాలిలో పేని నట్లుండదు. సోపపత్తికంగా అంకెలూ, అక్షరాలూ, ఉదాహరిస్తూ కొటేషన్లూ దొర్లిస్తూ నిరూపించుకుంటూ పోతాడు— ఆయన చెప్పినదంతా విన్నాక ప్రతివిషయమూ 'నిజమే-నిజమే' ననిపించింది — దేశం పతన మైపోయిం దనిపించింది — దీనికి పరిష్కారం చిదంబరరావు లాంటి వాళ్ళ తప్ప చూప లేరనిపించింది.

సంభాషణల్లో ఎంతసేపు టైం గడిచి

# చిదంబర రహస్యం

పోయిందో మాకే తెలియదు-ఇంతలో మరో ముగ్గురు స్టూడెంట్సు వచ్చారు.

'గురూజీ—రెండో ఆట అందదు—'స్వామి అన్నాడు.

'వాళ్ల మొఖం — మసం పోంది సినిమా ఎలా మొదలవుతుందోయ్ — లేవండి' చిదం బరరావు లేచి రూం లాక్ చేసి బయలు దేరాడు —

ఆయన మధ్యలో —

మేమంతా పరివారంలా చుట్టూ పరి వేష్టించి —

బస్సెక్కాము—అప్పటికే తొమ్మిదియాభై అయింది. మరో పదిహేను నిమిషాల్లో ఎల్లమ్మ తోట చేరాము. రాకరాక నేను రెండోఆట సినిమాకు బయలుదేరడం అదీ మధ్యలోనుండి చూడటమా ?

ఇలా అనుకుంటూ థియేటర్ దగ్గరకు చేరాము — లోపల ఆట నడుస్తున్నది—

'మొదలుపెట్టారు గురూ — ' చటర్జీ అరిచాడు — స్వామి బుకింగ్ వైపుకు పరుగెత్తాడు.

ఆశ్చర్యం!! అది మొదటాటే! ముగింపుకు వస్తోంది — మధ్యలో సరిగ్గా గంటసు పైగా కరంటు పోయిందట! నేను నిస్త్రరపోయాను— పోటమాట రాలేదు.

గుడ్లప్పగించి అలా చిదంబరరావును చూస్తూ ఉండిపోయాను — మేము వెళ్లిన కాసేపటికి మొదటాట ముగిసింది.

ఆట వదిలాకటిక్కెట్లకు స్వామి బయలు దేరాడు, నేను జేబులో నుండి పదిరూపాయల నోటు తీయబోతున్నాను, 'స్వామీ' చిదంబర రావుపిలిచాడు.

ఇలా చిటికెవేసినట్లు వేశాడు. రెండు పది రూపాయల నోట్లు. స్వామి చేతికిచ్చాడు. నేను దిగ్భ్రాంతుడినైనాను. ఎదురుగా విద్యుర్దీ పాలూ మనుషులూ కన్పడటంలేదు విరాట్ స్వరూపంతో చిదంబరరావూ ఆతను సృష్టిం చిన పదిరూపాయలనోట్లూ కన్పడుతున్నాయి.

అవి దొంగనోట్లుకాదు. చెల్లాయి.

స్వామి గ్రూపు మొత్తానికీ టిక్కట్లు తెచ్చాడు. హాలులో కెళ్లాము.

ఆటమధ్య టీలూ, కూల్‌డ్రింక్సు అన్నిం టికీ చిదంబరరావే డబ్బు పెట్టాడు.

డ్రాకులా సినిమా భయంకరంగానే వుంది.

కాని ఈ అద్భుతాలు చూచింతరువాత సిని మాలో సన్నివేశాలు ఆశ్చర్యంగా కన్పడలేదు.

(ఇంకా వుంది)

# నీలోనే ఉన్నాను

రుద్రరాజు శ్రీదేవి

మత్తు వదలిన మురళికి తను చేసిన పనేమిటో అప్పటికి గుర్తుకు వచ్చింది. బృందకేసి దీనంగా చూసాడు. బృంద వెక్కిళ్లుపెట్టి ఏడుస్తూంది. ఆవేశంలో దేహమంతా కదిలి పోతూంది. తలగడంతా తడిసి ముద్దయింది. తడారిపోయిన కంఠం పెగుల్చుకుని 'బృందా' పిలిచాడు. పడగ విప్పిన కోడెనాగులా బుసకొట్టింది బృందావని.

'ఛీ. దుర్మార్గుడా! నా బ్రతుకంతా బండలు చేసావు. నీ మనసులో యింత కుళ్లు దాగుండని తెలిస్తే, నీ యింటికే రాకపోదును. నన్ను నాశనంచేసావు. నీకేం అపకారం చేసాను? ... ఎందుకిలా నాశనం చేసావు నన్ను?...' రోషంగా, ఒకప్రక్క వెక్కిళ్లు పెడుతూనే అడిగింది.

ఏమని సమాధానం చెపుతాడు?...ఆమెను నాశనంచేయాలని అనుకున్నాడా...ఊహుఁ... ఎ-రం రోజులలో ఆమెను పెళ్లికూతురిలా, తన ప్రియమైన మధూ వధువుగా చూడాలనుకున్నాడు. కాని జరిగిందేమిటి? ... తన గుండెల్లో మండే మంటలను ఆర్పేందుకు త్రాగే ఈ విషపదార్థం మరియొకరి జీవితాన్ని రగిల్చేస్తుందని తెలుసుకోలేకపోయాడు. కనీసం ఊహించిఉంటే దాని జోలికే పోయేవాడు కాదు. ఇప్పుడు మధుకి ఏం సమాధానం చెపుతాడు? ... పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు. హృదయంలోని బాధంతా ముఖంలోనికి కొట్టొచ్చినట్లు కన్పడుతుంది. నూతిలోనుండి మాట్లాడుతున్నట్లు లోస్వరంతో కంపిస్తూ అన్నాడు. 'బృందా! నేను కలలో కూడా ఊహించనిది జరిగిపోయింది. నిన్ను క్షమను అర్థించేందుకు కూడా అర్హతలేదు నాకు. నా మధూకి నా ముఖమెలా చూపించాలో తెలియటంలేదు. భగవాన్! ఎంతటిస్థితి తెచ్చిపెట్టావయ్యా...

మురళి చెప్పేదేమీ వినిపించుకోకుండా అతిక్రౌర్యంగా 'దీని ముగింపు ఏమిటో నీకు తెలుసా' అడిగింది.

ముగింపు!! ఏమిటది ... మనసులో గొణుక్కుని పైకి నిశ్చలంగా'అవును. నా జీవితాన్ని ముగించడమే దీనికి సరిఅయిన ముగింపు. బ్రతికిఉండి ఈ మిత్రద్రోహాన్ని భరించలేను...' అన్నాడు మురళి.

'అది పిరికివాళ్ల లక్షణం' అన్న గంభీర పలుకులు విని యిద్దరూ ఉలిక్కిపడ్డారు.

మధు!!...మురళి తలదించుకుని కూర్చున్నాడు.

'మధూ'అని చిన్నకేకవేసి ఏడుస్తూ అతని దగ్గరగా వెళ్లబోయి మరల తమాయించుకుని; 'నిన్ను తాకే అర్హత లేదు మధూ. ఈ దుర్మార్గుడు నన్ను పతనంచేసాడు.' భోరున విలపించింది బృంద. బాధనంతా తనలోనే యిముడ్చుకుని, 'బృందా! నేనిప్పుడే వచ్చాను. మీ యిద్దరి మాటల వలన జరిగింది గ్రహించాను. అతను బుద్ధిపూర్వకంగా నిన్ను పాడు చేయలేదు. అతనంత ద్రోహి కాడు. దుర్మార్గుడూ కాడు. ఎన్నిసార్లో చెప్పాను. త్రాగటం మానేయరా అని. విన్నాడు కాదు. ఈ నాడు నా ఎదుట తలదించుకోవలసిన అవసరం రాకపోనుకదా...చూసావా మురళీ... చెడ్డెప్పుడూ చెడునే ఆశ్రయిస్తుందని. కాని నేను నీ వ్యసనాన్ని తప్ప నిన్ను తప్పుపట్టలేనురా...' తాపీగా అన్నాడు మధు.

మధూ అంటూ ఆర్తిగా కౌగలించుకున్నాడు మురళి. 'మధూ! నేనింత మంచితనాన్ని భరించలేనురా...నన్ను చంపేయరా... నన్ను చంపేయరా...' రోదించాడు మురళి. 'మురళీ నేను నీ కంటికి హంతకుడిలా కన్పిస్తున్నానా...జరిగిన పొరపాటును సరిదిద్దుకునే బాధ్యత మన యిద్దరిమీద ఉంది. బృంద జీవితాన్ని సుఖమయం చేయడానికి ప్రయత్నిద్దాం'అని బృందకేసి తిరిగి, 'బృందా! జరిగింది పొరబాటు. ఈ పొరబాటును మరిచిపోయేందుకు ప్రయత్నించు. దీనివలన జరగబోయే మనిద్దరి పెళ్లికి ఆటంకం రాదు. నీవెప్పుడూ నా బృందవే...'నన్నాడు గంభీరంగా.

మధు మురళి కంటికి గరళకంఠుడిలా కన్పించాడు.

బృందావని ఆగ్రహావేశాలతో కంపించిపోయింది.

'ఓహ్! ఏమి స్నేహం?...ఎంతటివాడివి మధూ?...నీ మిత్రుడి కామాగ్నిలో దగ్ధమయ్యాననే సానుభూతి లేదే నీకు. నీ కాబోయే భార్య శీలాన్ని హరించాడన్న కోపం లేదు, బాధలేదు. గొప్ప ఉదార హృదయుడవని అనిపించుకోవాలనా?...లేక నీవు పైకి వచ్చే అవకాశాలన్నీ భగ్నం అవుతాయన్న భయమా?... ఓహ్ ఎలాటివ్యక్తిని నమ్మి మోసపోయాను..' ఏడ్చింది.

మధు నిర్లిప్తుడై, నెమ్మదిగా బృంద దగ్గరకువెళ్లి ఆమె తల నిమిరాడు. 'నన్ను అర్థం చేసుకో బృందా!' అన్నాడు నెమ్మదిగా.

చివ్వున తల ఎత్తి 'నా కింకేమీ చెప్పొద్దు మధూ! నేనేదయినా సహిస్తాను కాని అవినీతిని సహించను...అవినీతిని ప్రోత్సహించే వారంటే అసహ్యించుకుంటాను. సరే కానియ్. నిన్ను మనసారా నమ్మినందుకు మంచి గుణపాఠం చెప్పావు. నా నిర్ణయం చెప్తాను విను. నీకింకా నా మీద ప్రేమనేది ఉంటే మురళితో పెళ్లి జరిపించు. పెళ్లైన తరువాతనుండి నా కళ్లబడకు. ఇదే నేను కోరేది...'ముఖం చేతులతో కప్పుకుని రోదించింది.

మధు, మురళీ స్తంభించి పోయారు.

పాలిపోయిన ముఖంతో మురళీ, 'తొందరపడకు బృందా!' వణుకుతు అన్నాడు. తీక్షణంగా ఒక చూపు విసిరింది మురళి వైపు బృంద. ఆ చూపులో అసహ్యం, ద్వేషం కొట్టొచ్చినట్లు కన్పడి బాధతో విలవిలలాడాడు మురళి.

ఆవేదనతో కమిలిపోయినముఖంతో, 'నన్ను అపార్థం చేసుకుంటున్నావు బృందా! ఆవేశంలో ఏదో ఆలోచిస్తున్నావు. శాంతంగా ఆలోచించి నిర్ణయానికి రా...నేను నీ మేలు కోరి చెపుతున్నాను. జరిగిన సంఘటన మనముగ్గురిమధ్యే ఉంటుంది...'అన్నాడుమధు. అతనిహృదయం ఆ యిద్దరి మధ్య నలిగి పోతూంది. ఏం మాట్లాడితే ఎవరికి బాధ కల్గుతుందోనని సతమతమవుతున్నాడు. తనేదయినా కాస్త తొందరపడి మాట జారాడో మురళి బాధపడి ఏ అఘాయిత్యానికి పాలబడతాడోనని భయం.

# నీలోనే ఉన్నాను

బృంద హృదయం తెలుసు. సహజంగా ధైర్యస్థైర్యాలైన బృంద సులభంగా తేరుకోగలదని, ఒంటరిగా నున్నప్పుడు ఆమెను అనునయించవచ్చని అనుకుని బృందవైపు ఎక్కువ సానుభూతిని, బాధను ప్రకటించలేదు. ఆమె అపార్థం చేసుకుంది. ఇంత తేలికగా తన అనుబంధాన్ని త్రెంచుకుంటుందని భావించలేని మధు గుండెల్లో మంటలు రేగాయి.

ఖస్సుమంది బృంద 'దయచేసి నాకేమీ చెప్పకు. ఏమి చెప్పినా నేను వినను. నేనొక నిర్ణయానికి వచ్చానూ అంటే అది జరిగితీరాలి' అంటూ విసురుగా వెళ్ళిపోయింది. మధు ముఖంలో ఒక విధమైన విలక్షణమైన భావం కదులాడుతుండటం చూసిన మురళి హృదయం పిండినట్లైంది.

ఇది జరిగిన వారం రోజులకు మురళీ బృందల వివాహం జరిగింది. పెళ్ళైన తరువాత మధు బృందతో, 'బృందా! జరిగినదేదో జరిగింది. దానిని మనసులో పెట్టుకోకు నీ జీవితం కుదుట పడాలని నేను కోరుకుంటున్నాను. గతాన్ని మరచి పొమ్మని వేడుకుంటున్నాను. ఆనాడు నేనలా ఎందుకు ప్రవర్తించానో నీకు తెలియదు బృందా! ఈ ఒంటరి జీవితంలో నా ప్రాణమిత్రుని ఎక్కడ పోగొట్టుకుంటానోనని భయపడ్డాను. నా ప్రాణాధికమైన నిన్ను ఆ స్థితిలో చూసి ఎంత మథనపడ్డానో మాటల్లో చెప్పలేను బృందా... సరే జరిగినది మరోసారి తలుచుకుంటే ఒరిగేదేమీలేదు. అతను చేసిన పొరపాటుకి అతను దిగుళ్ళి పోతున్నాడు. నీ మనస్సు మరల్చుకుని అతనిని ప్రేమించు. ఇంతకంటే నేనేమీ చెప్పలేను...' అన్నాడు.

బృందావని కసిగా నవ్వింది. 'అతనిని ప్రేమించాలా?... సలహా చెప్పేది నువ్వా?... చాలా బాగుంది. అతనిని ఎలా ట్రీట్ చేయాలో నాకు తెలుసు. నాకెవరు చెప్పనవసరము లేదు'.

పాలిపోయిన ముఖంతో వెళ్ళిపోయాడు మధు. మురళీచేత ఒట్టు వేయించుకున్నాడు—బృందను బాగా చూస్తానని, ఎట్టి పరిస్థితులలోనూ చావు పేరు తలపెట్టనని బృంద మనసు చాలా దెబ్బతింది...చాల జాగ్రత్త అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.



నలుగురిలోనూ ఉన్నప్పుడు మాత్రం ఆదర్శపత్నిలా నటిస్తుంది బృంద. మురళీకి ఆమె నటన చూస్తే చాల ఆశ్చర్యంగా ఉంటుంది. ఏకాంతంలో మాత్రం మురళీకి దక్కేవి శూలపుపోట్లులాటిమాటలు,చేతలూ, అసలు బృందది ఆవేశం, అహంకారమూ గల ప్రకృతి. దీనికితోడు పెంకితనము సహజంగా సిద్ధించింది.

మధు, మురళి, బృందం వీరు ముగ్గురు క్లాసుమేట్స్. మురళి ధనవంతుల బిడ్డ. అతనికి తల్లి, తండ్రి చిన్నతనంలోనే పోయారు. మధూకి ఎవరూ లేరు. నిరుపేద. కాని అతని గుణగణాలకు ఆకర్షితుడై మురళీ అతని పూర్తి బాధ్యత స్వీకరించాడు. మధూకి మురళీ అంటే ప్రాణం. అతని ఆస్తి వ్యవహారాలవీ చూస్తూ అన్నీ సక్రమముగా ఉండేటట్లు చేస్తూ తన కృతజ్ఞతను వెల్లడి చేసుకుంటున్నాడు. మురళీకి మధూయే లేకపోతే ఒక్క క్షణం జరగదు అన్నంతగా ఫీలవుతాడు. ఇలా వీరిద్దరూ తమ ఒంటరి తనాలను వదిలి హాయిగా ఉండేసమయంలో బృంద పరిచయమవుతుంది. బృంద క్రమముగా వీరిద్దరికీ చనువవుతుంది. ఇద్దరూ కూడా బృందవైపు ఆకర్షితులౌతారు. ఆ ఆకర్షణ ఆరాధనగా మారి వారి హృదయాలమటుకే పరిమితమవుతుంధి. ఒకరి ప్రేమ ఒకరికి తెలియదు. బృంద మధూకి మనసిచ్చింది. అది వెల్లడించినతరువాత పెళ్ళినిశ్చయించుకున్నారుబృందా, మధూలు మురళి తనప్రేమనంతా తనలోనే యిముడ్చుకుని, గుండె దిటవు చేసుకుని వారిని మనసారా దీవించాడు.

కాని మురళీ మనసులోని బృందను బయటకు త్రోసివేయలేక, లోన యిముడ్చుకోలేక భరించ రాని బాధలో త్రాగుడు మొదలెట్టాడు. చాలా కాలం వరకు మధు యిది కనిపెట్టలేదు. తెలిసి మానేయమని బ్రతిమిలాడాడు. కాని ఇది నాకు చాలా కాలంనాటి అలవాటు. ఈ విషయంలో మాత్రం నీవు నన్ను ప్రెస్ చేయకు. మానివేయాలని నాకు దృఢంగా కల్గితే తప్పకుండా మానివేస్తాను.' అని అతనిని మాట్లాడకుండా చేసాడుమురళి.

బృందావనికి ఒక్క తల్లి తప్పితే ఎవ్వరూ

# తరచుగా ఇంట్లో 'డాక్టరు'గా పని చెయ్యాల్సి వస్తుందా?

## బలీయమైన మరియు విశ్వసనీయమైన అనాసిన్ మీ మందుల పెట్టెలో ఉంచుకోవటం చాలా మంచిది.

ఆ రోజు ప్రతిదీ సక్రమంగా జరుగని రోజులలో ఒకటి. మీరు ఆలస్యంగా లేచారు, ఇంట్లో వంట సామాన్లు అయిపోయాయి. మీ అబ్బాయికి జలుబు చేసింది. ఫ్లూ వస్తున్నట్లు అనిపిస్తుంది.

అతన్ని వేడి పానీయంతో అనాసిన్ ఇచ్చి పడుకో పెట్టండి. సత్వరంగా పని చేసే అనాసిన్ జలుబులు మరియు ఫ్లూల వలన కలుగు నొప్పులను, బాధలను నివారిస్తుంది. డాక్టరు ఇచ్చే విశ్వసనీయమైన మందు లాగా అది ఒక మందుల సమ్మేళనం.



మీ అమ్మాయి ఒంట్లో బాగుండక, బాగా నొప్పి మరియు నడుం నొప్పితో స్కూలు నుంచి త్వరగా తిరిగి వచ్చింది.

ఆమెకు వేడి నీళ్ల కాపు పెట్టి అనాసిన్ ఇచ్చి హాయి కల్పించండి. ఆమె త్వరలోనే సంతోషంగా, కులాసాగా ఉండగలదు. అనాసిన్ కొన్ని రోజులలో కలుగు వ్యథను తగ్గిస్తుంది. ఎందువలనంటే అది బాధను తగ్గించుటయే గాక బాధ వలన కలుగు మానసిక చికాకును సత్వరంగా తొలగిస్తుంది.



మీ భర్త తనపై అధికారితో పేచీ పడి, వ్యాకులత వలన విపరీతమైన తలనొప్పితో బాధ పడుతున్నారు.

ఆయనకు చల్లగా సేద తీర్చే పానీయం, అనాసిన్ ఇచ్చి కులాసా చేకూర్చండి. ఎందువల్లనంటే అనాసిన్‌లో ప్రపంచమంతటా డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలు బాగా ఉన్నాయి.





మీరు పార్టీకి ఎన్నో ఏర్పాట్లు చేయవలసి యున్నాయి కాని వ్యవధి చాలా తక్కువ ఉంది. మీరు అలసిపోయారు, తలనొప్పితో బాధ పడుతున్నారు. ఏ క్షణంలోనైనా అతిథులు రాగలరు.

మీ సాయంత్రపు కార్యక్రమం తలనొప్పి వలన పాడు కావచ్చును. సత్వర నివారణ పొందండి. అనాసిన్ తీసుకోండి. మీరు మళ్లీ సంతోషంతో ఉండగలరు. గుర్తుంచుకోండి, మీ కుటుంబపు డాక్టరును పిలువనవసరం లేని స్వల్ప సందర్భాలలో, బలీయమైన మరియు సత్వరమైన అనాసిన్ వాడండి. అదే మీ ఉత్తమ మిత్రము.



బలీయమైన మరియు విశ్వసనీయమైన

# అనాసిన్

భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పినివారిణి



Regd. User of TM: Geoffrey Manners & Co. Ltd.

లేరు: ఆమె కొద్దిపాటి ఆస్తిపాస్తులతో కూతురును అల్లారు ముద్దుగా పెంచింది. ఆ గారాబమే బృందకు అహంకారమూ, ఆవేశ ప్రవృత్తిని ఎక్కువ చేసాయి. ఆమెకు కూడా కొన్నిపటిష్టమైన ఆశయాలున్నాయి. తన ఆశయాల గురించి ఎప్పుడూ మురళి మధూలకు చెపుతుండేది. ఆ ఆశయాల చర్చే వారిద్దరినీ ఎక్కువగా ఆకర్షించింది. ఆమె సహజ గుణాలను ఆశయాల ముసుగులో నుండి చూడలేక పోయారు. మిత్రులిద్దరికి ఆమె ఒక దేవతా మూర్తిలా గోచరించింది.

బృంద ఒకసారి ఆవేశంగా అంది. 'మన సిచ్చినవానికే తనువు అర్పించాలి. విధివక్రించి స్త్రీ శీలం కోల్పోతే, అపవిత్రమైన దేహంతో ప్రియుని మోసగించి అతనిని వివాహమాడ కూడదు. నాకు చాల బాధగా ఉంటుంది. మనసొక చోట, తనువొక చోట... తలుచు కోడానికే బాధగా ఉంది...'

కూతురి విలక్షణమైన అభిప్రాయాలు, ఆశయాలు వింటూతల్లి బెంగపడేది. మధూ, మురళీలు ముచ్చటగా నవ్వుకునేవారు. ఆనాటి ఆశయాల, అభిప్రాయాల చర్చలే బృంద హృదయంలో తనను ఒక మోసగానిగా చిత్రించినవని బాధపడ్డాడు. రానురాను ఆమె ప్రవర్తనలో, ఆమె గుణాలు బయటపడ్డాయి.

ఆ రోజు—మధూ పనిమీద బయటకు వెళుతూ తనకోసం బృంద వస్తుందని, ఆమెను తనొచ్చేదాకా ఆపమని చెప్పి వెళ్లాడు. వీరిద్దరి పెళ్లి స్థిరపడ్డాక బృందతో మాట్లాడాలంటేనే భయపడుతున్నాడు మురళి, ఎక్కడ తన బాధ బయటకు ఉబుకుతుందోనని.

మధూ వెళ్లాక—వంటామెతో 'బృంద వస్తే తనకు తలపోటుగా ఉండిపడుకున్నానని, మధూవచ్చేదాకా కూర్చోమని చెప్పమని, తనను లేపవద్దని తన గదిలోకి వెళ్లిపోయాడు. ఆ రోజు మరీ చికాకుగా ఉండి డోసుమీద డోసు వేయడం ప్రారంభించాడు. తనెవరో తనకే తెలియనంతగా త్రాగాడు. ప్రపంచ మంతా ఊయల ఊగుతున్నట్లు, తను స్వర్గంలో ఉన్నట్లు భావించుకుంటూ కూర్చున్నాడు.

వంటామె చెప్పినా వినక, స్త్రీసహజమైన జాలితో తనను చూడడానికి వచ్చిందిబృంద. బృందను చూడగానే తన లోని యిష్టం వెర్రితలలు వేసి ఆమెను పాడు చేసిన దాక విడిచి పెట్టలేదు. అప్పుడు ఆమె ఆశయాలు కాని,

# నీలోనే ఉన్నాను

మిత్రద్రోహం కాని గుర్తుకు రాలేదు. అతని మంచితనం మత్తులోపడి మాయమయింది. ఫలితం ... ఏముంది? ... ఘోరజీవితం ... బృందకు. ఎదురు తిరగలేని బలహీనత... ఆవిడకు తన మంచి తనంలో నమ్మకంలేదు. తన బాధలో సానుభూతిలేదు. తనను ఒక మోసగానిలా చిత్రించుకుని అనుక్షణం బాధిస్తుంది. కాని యింత జరిగినా మధూకి మాత్రం తనమీద కోపం లేదు. అనుమానం అసలే లేదు. తను తెలియనిస్థితిలో జరిగిందని దృఢంగా నమ్మాడు. అదే చాలు తనకు. ఎడారిలో ఒయాసిస్‌లా ఆభావనే తనకుఒకింత శాంతినిస్తూంది. బృందా, మధూలను విడగొట్టిన మత్తు పానీయాన్ని ఆ రోజునుండే పూర్తిగా మానివేశాడు. కాని బృంద అతనిని ఏడిపించుదామని త్రాగుడు మొదలుపెట్టింది.

---

ఒక గొప్ప దేశంలో పెద్ద ఎన్నికలు జరుగుతున్నాయి. ఒకాయన పోలింగ్ బూత్‌కి వెళ్లి బాలట్ పత్రం తీసుకున్నాడు. అది మడిచివుంది.

"దాన్ని తెరిచి చూడకండి! అలాగే పెట్లో పడెయ్యండి!" అని హెచ్చరించాడు అక్కడ అధికారి.

"అదేమి"టన్నాడు ఒ.

"వోటింగ్ రహస్యంకదా?" అన్నాడు అ.

---

మొదట్లో కొద్ది కొద్దిగా సిప్‌చేసి మత్తుగా త్రాగినట్లు నటించి, మురళి బాధను చూసి కసితీరా నవ్వేది. తరువాత ఆ మత్తులో ప్రపంచాన్ని మరచిపోగల మత్తుందని తెలుసుకుని అలవాటు చేసికుంది. ఇది చూడలేక మురళి, మధూని రమ్మని ఉత్తరం వ్రాసాడు. మధూ ఎంతో బాధపడుతూ వచ్చాడు.

బృంద ఆ రోజు మరింత మత్తుగా త్రాగింది. మధూని చూసి. 'ఎవరూ... నా మధూవా?... ప్రియతమా... నిన్ను చూసి ఎన్నాళ్ళయింది... ఈ విరహం భరించ లేను... మధూ...ఒక్క ముద్దివ్వు మధూ... ఇంక నిన్నేమీ అడగను' అంటూ మధూని కౌగలించుకోబోయింది పిచ్చి పిచ్చిగా ప్రేలుతూ...

మధూ కోపంతో ఊగిపోయాడు. బృందని పట్టుకుని 'ఇదిగో. తీసికో... నీ మధూ యిచ్చే ముద్దులు' అంటూ చాచి పెట్టి రెండు లెంపకాయలు వేసాడు. బృంద వెర్రిగా చూసింది.

'మధూ' కంగారుగా ముందుకువచ్చాడు మురళి.

'కంగారు పడకు మురళీ! ముందీ రాక్షసిని గదిలో పడుకోబెట్టి బైటగొళ్ళెంపెట్టు' "నేను రాక్షసినట్రా...' రౌద్రంగాలేవబోయి మరలా కూలబడిపోయింది బృంద 'ఇదుగో బృందా... నోరుమూసుకు పడు' గర్జించాడు మధూ.

మధూ, మురళీలు యిద్దరూ సాయంపట్టి గదిలో పెట్టి బైటగొళ్ళెం పెట్టారామెను.

'మధూ' అంటూ ఏదో చెప్పబోయాడు బాధగా మురళి.

'ఇప్పుడేం చెప్పకు మురళీ... నేను చాలా అలసిపోయాను. రేపు దీనికి సరి అయిన పరిష్కారం చెపుతాను.' తన గదిలోనికి వెళ్ళిపోయాడు మధు.

మురళీ ఏమీ తోచనివానిలా నిలుచుండి పోయాడు ఒంటరిగా.

బృంద గదిలోనుండి, 'మధూ... నన్ను కొడతావా... నిన్ను ప్రేమించినందుకు యిదా బహుమతి... చూడు మీ యిద్దరినీ సర్వ నాశనం చేస్తాను. చేయకపోతే నాపేరు బృందేకాదు...' అంటూ పదురుతూంది తడబడుతూ... మురళి నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు నెత్తిన చేతులు పెట్టుకుంటూ.

* * *

తెల్లగా తెలవారిం తరువాత రంగన్న లేపినదాకా లేవలేదు మురళి. రాత్రి నిద్ర చాలక జేవురించిన ముఖంతో, ఎరు పెక్కిన కళ్లతో భారంగా లేచి ముఖం కడిగి హాలులో కూర్చున్నాడు మధులేచి ఏమి చెపుతాడోనని—మధూ తన గదిలో నుండి ఎంతకూ రాకపోయేసరికి మురళి ఆలస్యానికి తాళలేనట్లుగా మధూ గదిలోనికి వెళ్లాడు. గది తలుపులు త్రోసి, లోనికి వెళ్లబోయే మురళి కెవ్వుమని కేకవేసి పడిపోయాడు. అతని హృదయ విదారకమైన అరుపుకి నౌకర్లందరూ పరిగెత్తుకు వచ్చారు. గదిలో దూలానికి వ్రేలాడుతున్న మధూ నిర్జీవ కళేబరాన్ని చూసి కొయ్యబారిపోయారు. తరువాత గొల్లుమన్నారు. బృందకీ విషయాన్ని తెలియజేసారు. బృంద స్పృహతప్పి పడిపోయింది

తరువాత వారం రోజులకు బృందకు

## ప్రశ్నావళి

**టి. పి. — హైదరాబాదు.**

ఏమీ అనుకోనంటే వో నగ్నసత్యం. . . వాలు చూపులు విసిరి, మెత్తని చిరునవ్వులు విసిరి, ముత్యాల పలుకుల్లాంటి నాలుగు మాటలు విసిరి ఇంకా అవసరం అయితే మానం కూడా అర్పించి ఉద్యోగాలు సాధించి మేము మీతో సమానమేనోయ్ అనడం వో గొప్పా? వో ప్రగతా?

కాదు. కాని చిన్న ధర్మసందేహం ప్రభాకర్. మరి ఉద్యోగాలు చేస్తున్న మగవాళ్లంతా ఏంచేసి ఉద్యోగాలు సాధించారో. . . కూడా చెప్పకూడదా ? ఉడుక్కుని ఎప్పుడూ యిలా రాయకు. బాగుండదు!

**వి. వి. వి. కె. — వడ్డుగండ్ల.**

పత్రికలో మీరిస్తున్న జవాబులనూ, మీ విప్లవ భావాలనూ గమనిస్తున్న మాకు మీ లేఖ సమ్మతక్యం కావడం లేదు.

ఏంకె విప్లవభావాలూ, వ్యక్తిత్వం మీద నమ్మకాలూ, వుంటే రామాయణం పవిత్ర గ్రంథం అనుకోకూడదా?!

**జి. ఆర్. ఆర్. — గుంటూరు.**

భగవంతుడు ఆడవాళ్లందరికీ యించుమించు తియ్యని కంఠం యిచ్చి మగవాళ్లకు అన్యాయం చేశాడంటాను. మీరేమంటారు?

మీరు చాలా మంది ఆడవాళ్ల కంఠస్వరాలు వినలేదంటాను!

**వి. ఎల్. ఆర్. ఆర్. — గానుగపాడు.**

ప్రేమించి పెళ్లి చేసుకోవడం, పెళ్లి చేసుకుని ప్రేమించడం— ఏది ఉత్తమమైనది?

పెళ్లాన్ని మనిషిగా చూడ్డం చేస్తే— రెండూ మంచివే!

**కె. ఆర్., కె. జె., కె. ఎస్., కె.ఎ., కె. ఎమ్.**

**— కొజ్జూరు.**

స్త్రీ మనస్సుని సముద్రపు లోతుతో పోలుస్తారెందుకు?

అంతు తెలియక పోవడమే కాదు., అలజడికి కేంద్రం— అంచేత.

**పి. వి. ఆర్. — వరంగల్లు**

ఇంకెప్పుడూ మిమ్మల్ని మీరు లాటకి, మొండి ఘటం అనే పదాలతో రూపు దిద్దుకోవద్దని మనసారా వేడుకొంటున్నాను. . .

చూడు తమ్ముడూ, పేరు ఎలా వున్నా ఫరవా లేదు—దోరణి అర్థం చేసుకుంటే. మగవాళ్ల మీద కత్తి కట్టాననుకొంటారు చాలామంది— కాని నేను కట్టిన కత్తి వారి సంకుచితత్వాల మీద అని వాళ్లకీ తెలుసు. నాకూ తెలుసు! నేనెంత సేపూ, మృదుమధురంగా, సుతారంగా, సున్నితంగా చూసి వెన్న పూసలా. . మసి పూసి మారేడు చేసి చెప్పను .. చెప్పదల్చుకున్నది. అది నా తత్వానికే విరుద్ధం. నేను నిజం అనుకునే దాన్ని, తప్పు అని భావించని దానిని చెప్పడానికి జంకను. అది చెప్పి తిట్లు తిన్నా భయం లేదు నాకు. అంత మొండిదాన్ని. అంచేత లాటకాది నామాలు నాకు తగినవే. నువ్వేం బాధపడకు. బట్ ఐ లైక్ యువర్ ఇన్నొసెన్స్!

తెలివి వచ్చేసరికి రెండు ఉత్తరాలు అందుకుంది. ఒకటి మధు అంతిమ సందేశం. మరొకటి మురళి ఆవేదన, ఆగ్రహాలతో కూడిన తిరస్కారం. మధూ వ్రాసిన ఉత్తరం తీసింది ముందుగా కన్నీరు కారుస్తూ...

బృందా!

నీవు నన్నెంతగా ప్రేమించావో నాకు తెలుసు. కాని నామీద ఉండే ప్రేమతో నీవు మరియొకరి జీవితాన్ని బలిపెడుతున్నావంటే నాకు నీ మీద ఉండే పవిత్రమైన ఆరాధనంతా యింకిపోయి, దానిస్థానే అసహ్యం పేరుకుపోయింది. నా ప్రేమ మూర్తి నా మురళి జీవితంలో ప్రళయం సృష్టిస్తుందంటే ఏవగింపు కల్గుతుంది. స్త్రీ హృదయమతి సుకుమారమూ, క్షమ, కరుణతో నిండియుంటాయనే అనుకొనేవాడిని. కాని యింత కఠినమైనదిగానూ, కర్కశంగా యితరులను బాధ పెట్టేంత పగతో నిండిపోతూందనుకోలేదు. నేను ప్రేమించిందొక ప్రణయమూర్తి కాదు, కఠినాత్మురాలినని, హృదయం లేనిదానినని అనుకుంటే నా మనసు విలవిల లాడిపోతూంది. నీ ఆశయాల ముసుగులో నుండి నీ భయంకర స్వరూపాన్ని ఊహించలేక మోసపోయాను నా జీవితమేమయినా, మురళి జీవితం సుఖశాంతులతో కలకలలాడాలని కలలు కన్నాను. కాని నా ఆశ నిరాశే అయింది.

బృందా! నీ మనసు ఎంత గాయపడిందో, ఆవేశంతో ఆ గాయాన్ని మాన్పుకోలేక ఎలా చిత్రవధ ననుభవించేదీ నాకు తెలుసు. జరిగింది మరిచిపోతేనే నీ జీవితానికి రక్షణ. నీవు మరిచిపోనడమనేది నేను బ్రతికి ఉండగా జరగదని నాకు తెలుసు. అందుకే మీ యిద్దరి జీవితాల నుండి తప్పుకుంటున్నాను. మురళీతో నీవు సుఖపడితేనే నాకు ఆత్మశాంతి. నేనెక్కడికీపోలేను. మీ యిద్దరిలో నూ ఉంటాను. మురళి జీవితాన్ని నీ చేతులలో పెట్టి వెళ్లుతున్నాను. ఇకమీదట అతనిని సుఖపెట్టమనేది నా ఆఖరి కోరిక. నా కొరకు నీవు, మురళి దుఃఖించవద్దు. నెనెక్కడికీ పోలేను. నన్నింతగా ప్రేమించిన నీలోనే ఉంటాను. నీలోనే ఉన్నాను...నీలోనే ఉన్నాను. ఇది నిజం ... మధు ...

బృంద కృళ్లి కృళ్లి ఏడ్చింది. ఎంత ఏడిస్తే ఏం లాభం?...పోయినది తిరిగి పొందలేము కదా!... మనకు దూరమైతేనే వారి యొక్క విలువలు తెలిసేది. మురళి వ్రాసినది భయంగానే తీసి చూసింది. అది చదివాక గుండెల్లో సముద్రాలే పొంగాయి.

—నిన్ను ఏమని సంబోధించడానికీ మనస్కరించడము లేదు. ఇంత క్రితం వరకూ నేను నీ ఎదుట దోషిగా నిలుచున్నాను. ఏ త్రాగుడు మత్తులో నీ పట్ల నేను నేరం చేసానో దానిని నేటివరకూ దిద్దుకుందామనే ప్రయత్నించి విఫలుణ్ణి అయ్యాను. కాని నామనసు నీవు అర్థం చేసుకోకుండా అదేస్థితిలో నామీద కసి

# నీలోనే ఉన్నాను

తీర్చుకోబోయి నా మిత్రుణ్ణి నాకు దూరం చేసావు. నా ప్రాణంలో ప్రాణం అయినమధూని నాకు తెచ్చి యివ్వగలవా?... నాదృష్టిలో నీవొక హంతకురాలివి. ప్రాణమైన నా మధూ ఆత్మహత్యకు కారకురాలివైన నిన్ను చూస్తే నాకు కంపరం పుట్టుకొస్తుంది. నిన్ను నేనిక భరించలేను. నీకు ఈ యిల్లు, నా ఆస్తిలో సగం వ్రాసి యిచ్చాను. ఇక్కడే ఉండవచ్చు. నేను మనశ్శాంతి కోసం వెళ్లిపోతున్నాను. నన్ను వెదుక వద్దు. మధు అంతిమ సందేశం చదివాను. కాని అతను వ్రాసినట్లు, త్యాగమూర్తి అయిన మధూ నీలో ఉండడం అసంభవం. నా కెప్పటికైనా మధూని నీలో చూడగలనన్న భావన కల్గినపుడు, జీవించియుండగా ఒకసారి చూడడానికి వస్తాను. నా కొరకు నీవు నిరీక్షించవలసిన పనిలేదు. నీ యిష్టమొచ్చినట్లు ఉండవచ్చు.

అసలు నేను త్రాగుడు ఎందుకు మొదలెట్టానో నీకు తెలియదు. అది కూడ విను. నిన్ను మనసారా ప్రేమించాను. కాని నా ప్రేమ వెళ్లడిచేసి నిన్ను పొందుదామనుకునే సరికి మధూ ప్రేమ వెల్లడి అయింది. నా బాధను నాలోనే దాచుకుని నిన్ను, మధూని మనసారా దీవించాను. నా భగ్న హృదయంలో నిన్ను మధూ వధువుగానే చూడాలన్న భావంతో నన్ను నేనే మరిచిపోయే తాపత్రయంలో

ఎస్. కె. — హైదరాబాదు.

మీరు బొట్టు పెట్టుకోరని ఏమేమో అంటారు కాని, మీరు బొట్టు పెట్టుకుంటారని, నల్ల పూసలు ధరిస్తారని చూసిన నాలాంటి వాళ్ళకి అవి బాధగా వుంటాయి. మీ వారి స్పీచ్ రోజున మీర ధరించిన పాత కాలపు హారం చూసి ఆశ్చర్యపడ్డాన

ఎందుకు? ఓల్డెస్ట్ యీస్ లేటెస్ట్—. అదీ ఇప్పుడు ఫాషను. . . యిప్పుడు— పవని నిర్మల ప్రభావతి అభిమానంతో యిచ్చిన మెట్టెలు కూడా పెట్టుకున్నాను. 'అవి చూసుకున్నప్పుడల్లా నేను జ్ఞాపకం రావాలి' అంది. . .

ఎస్. ఎస్. — బుద్వేలు.

అపకారికి ఉపకారం చేయాలంటారు. అలా వుపకారం చేస్తూ పోతే- మనకేం లాభం!

లాభనష్టాలు బేరీజు వేసి చేసేది ఉపకారం ఎలా అవుతుంది? పెట్టుబడి అవుతుంది.

ఎస్. ఎస్. — విశాఖపట్నం-4.

సినిమా కథలు రాసుకుంటున్న మీ రచయిత్రులకి, ఎందరో మహానుభావులున్న యువభారతి (సికింద్రాబాదు)లో స్థానం ఉన్నట్టా? లేనట్టా?

ఆ సంగతి ఏ కృష్ణమూర్తిగారో, విశ్వనాథంగారో, డాక్టర్ సుబ్రహ్మణ్యంగారో చెప్పాలి. . ఏం? యిన్నాళ్ళూ మగవాళ్ళు రాస్తే రాని అభ్యంతరం— సినిమా కథకి— ఆడవాళ్ళు రాస్తే ఎందుకువచ్చిందో మీకు!!

ఇ. టి. ఎస్. ఆర్. — సూళ్ళూరు పేట.

పురుషుడికి అధికారం, స్త్రీకి అణకువ ఉండవలసిన మనదేశం యీ గతికి దిగజారవలసిన కారణం!

పురుషుల అధికార దుర్వినియోగం!!

జి. వి. ఆర్. — వీరవాసం.

అంతులేని యీ అవినీతికి అంతం ఎప్పుడు?

అవినీతి చట్ట సమ్మతం చేసినప్పుడు!




వై. ఎం. ఆర్. చెన్నూరు.

ప్రేమకు, త్యాగానికి తేడా ఏమిటి?

ఏమీ లేదు!

బి. ఎస్. ఆర్. కోనాపురం.

చచ్చి సాధించేది ఏమీ లేదని తెలిసి కూడా ఈ మానవులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటారు?

బ్రతికి భరించే ఓపిక నశించి!

—కె. రామలక్ష్మి

త్రాగుడు అలవాటు చేసుకున్నాను ... కాని నిన్ను ద్వేషిస్తున్నాను యిప్పుడు. ద్వేషిస్తున్నాను. నిన్ను...

ఈజన్మ కిక నీ కేమీ కాని—

మురళి...

భగవాన్! నేను చేసిన దానికి శిక్ష కావలసినదే...ఎవరిని ఏడిపించుదామని ఎగిరిందోవారే తనను జీవిత మంతా ఏడవ మని తిరస్కరించి పోయారు. ఏవరివీమీద కసి పెంచుకుందో వారిలో ఒకరు పై లోకాలకెడితే యింకొకరు దేశాలుపట్టి పోయారు. చివరిక్షణం వరకూ శాంతం కోల్పోవని మురళీ, మధూల వ్యక్తిత్వమే చివరికి తనని అశాంతిపాలు జేసింది. వారిద్దరి జీవితాలతో ఆటలాడుకుంది. తన అహంకారమూ, ఆశయాలు ఏమయినాయి తననేమయినా రక్షించాయా. అవే తనను అంధకారంలోకి దించాయి భగవంతుడా! నాకెవరున్నారిక? నే నెవరి కోసం?... అమ్మనుకూడా తన పెంకితనానికి బలియిచ్చింది. అప్పుడు నా కళ్ళు మూసుకుపోయాయి. ఇప్పుడు తెరుచుకున్న కళ్ళకి చీకటే తప్ప వెలుగే లేదు. నాకేది దారి... భగవాన్!' అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది...

*    *    *

పదిహేను వత్సరాలు కాల గర్భంలో కలిసి పోయాయి. బృందావని జీవితం ఆరోజు తోనే మారిపోయింది. ఎప్పుడో ఒకప్పుడు వస్తానన్న మురళీ కోసం ఎదురు చూస్తూ కాలంగడుపుతుంది. గుండె నిబ్బరంచేసికుని మురళి వదిలి పోయిన ఆస్తిని వృద్ధిచేసి, వచ్చే ఆదాయింతో, పేద విద్యార్థులను చదివిస్తూ, అనాథలను ఆదరిస్తూ తనను తాను పూర్తిగా మరిచి పోయింది. ఒకప్పుడు తనను అసహ్యించుకున్న చుట్టు ప్రక్కలవారే తనను గౌరవించుతున్నారు. ఆవేశం, అహంకారమూ వదిలిపోయి హుందాతనమూ, గంభీరత, ముఖంలో నిర్మలత్వము చోటు చేసుకున్నాయి. నుదుట కుంకుమతో, లేతరంగు నేతచీరలో బృందావనిని చూస్తే ఎవరికైనా నమస్కరించ బుద్ధి పుడుతుంది. ఆమెసదామౌనమేధరించివిప్పుడైనా ఏదో నామస్మరణచేస్తూంది మనసులో...

ఒక రోజు సాయంకాలం పాత స్మృతులతో ఎందుకో మనసు పదే పదే కలవరపాటు చెందుతుంది. తోటలో కలతగా తిరుగుతుంది బృంద. యింతలో గోపీ వచ్చి, 'అమ్మగారూ! మీ కోస మెవరో వచ్చారమ్మా! ఇక్కడకు తీసుకు రమ్మంటారా' అడిగాడు వినయంగా. బృందకి చాల విసుగ్గా ఉంది. 'ఎవరో ఏ చందాలకో వచ్చుంటారు; తరువాత రమ్మని చెప్పరా. నా మనసేం బాగోలేదు...' అంది. గోపీ వెనుదిరిగాడు. 'అరే...ఆ రే వచ్చేసా రమ్మ గారూ' అనరిచాడు...

బృంద కోపంగా వెనక్కు తిరిగింది. ఎవరూ యింత చొరవగా రారు. కాని అతనిని చూసి స్తంభించి పోయింది. మురళి! తనభర్త ఎన్ని యుగాల నిరీక్షణ...తన స్వామి తనను క్షమించాడు...ఆనందం పట్టలేక 'స్వామీ. అంటూ మురళీ కాళ్ళమీద పడిపోయింది' 'బృందా! లే' అన్నాడు మురళీ శాంతంగా.

'వద్దు. స్వామీ. యిన్నేళ్లనుండి నా గుండెల్లో పేరుకున్న దుఃఖమంతా కరిగినీరై, నేను చేసిన పాపమంతా పోయేలా, మీ పాద ప్రక్షాళన చేయనీయండి మురళీ...'

మురళి కనులు చెమ్మగిల్లాయి.

'బృందా! అంతా విన్నాను. రంగన్న చెప్పాడు. నేను వస్తూంటే దారిలో కనిపించాడు. బృందా! ఎన్ని దేశాలు తిరిగినా మనశ్శాంతి దొరకలేదు. ఎక్కడా మధూని చూడలేకపోయాను. మధూ వ్రాసినట్లుగానే చివరకు నీలోనే మధూని చూద్దామని వచ్చాను. ఎవరి కర్మకు ఎవరు కర్తలు ? ... ఏది ఏలా జరగాలో అలా జరుగుతుంది. మనం నిమిత్త మాత్రులం ... ఇప్పుడు నిన్ను చూస్తుంటే నా మధూని చూసినట్లుగానే ఉంది. నాకెంతో తృప్తిగా ఉంది...'అంటూ ఆమెను లేవదీసి అక్కున చేర్చుకున్నాడు.

'స్వామీ! మీరులేని ఈ బృందావని యిన్నేళ్ళూగా చిన్నబోయింది.' అనుకుంటూ తన్మయత్వంతో కళ్ళు మూసుకుంది.

ఆమె ఆరాధనకు పరవశించాడు మురళి...

వారి మనసుల్లో మధూ వ్రాసినమాటలు మళ్లీ మళ్లీ ప్రతిధ్వనించాయి ... "నీలోనే ఉన్నాను ... నీలోనే ఉన్నాను"అని... ...

# వారఫలం

—మహేష్

## 5-7-1974 శుక్రవారం మొదలు
## 11-7-1974 గురువారం వరకు

**మేషం** :— వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారిలో గౌరవం బాగుంటుంది మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి వృత్తిలో ఆదాయం పెరుగుతుంది సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**వృషభం** — మీ కార్యక్రమాలు బాగుంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది విలాస వస్తువులు కొంటారు

**మిధునం** — చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది మిత్రులకు సహాయం చేస్తారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కర్కాటకం** — మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి వారంమధ్యలో మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు వ్యాపారంలో ప్రయాసకు గురికాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు బంధు మిత్రులను కల్సుకొంటారు

**సింహం** — వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది ప్రయాణాలు వాయిదా పడతాయి ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి ఉద్యోగరతో గౌరవం బాగుంటుంది స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవకార్యాలు నెరవేరతాయి

**కన్య** — మీ కార్యక్రమాలు నిర్విఘ్నంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**తుల** :— అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు స్త్రీలకు—పుణ్యకార్యాలుచేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** :— వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది బంధుమిత్రులనుకల్సుకొంటారు.

**ధనుస్సు** — మీ ఆలోచనలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు బాగుంటాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఫలిస్తాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి సహసముతో కూడిన వ్యవహారాలులాభించగలవు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సంతోషకరమైన వార్తలనువింటారు

**మకరం** — వృత్తిలో నూతనావకాశాలు లాభిస్తాయి పోటీవారిలో గౌరవం బాగుంటుంది భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**కుంభం** :— సహాయం చేస్తావన్న వారు సమయానికి తప్పుకోవచ్చును ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మీనం** — ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది వారం మధ్యలో సాహసిక వ్యవహారాల్లో నష్టంవస్తుంది మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వ్యతిరేకమైన వార్తలను వింటారు స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది



'ఏమండీ! మీరు డైరక్టుచేసిన కొత్త సినిమా చూపించరూ?'

"ఛ ఛ! అది పచ్చి శృంగారం వున్న సినిమా. నీలాంటివాళ్ళు చూడకూడదు!"

# బంగారు కలలు

## యద్దనపూడి సులోచనారాణి

*(గత సంచిక తరువాయి)*

## 56

రవి శేషగిరిని హత్య చేసాడనే వార్త, రవికి తెలిసిన వాళ్లందరిలో దావానలంలా వ్యాపించింది!

పోలీసు అధికారుల ముందు రవి తనే స్వయంగా హత్య చేసినట్టు వాంఙ్మూలం యిచ్చాడు.

'ఈ హత్య నేనే చేసాను. సరోజని శేషగిరి కత్తితో పొడవబోతుండగా చూసాను. ఆమెని కాపాడాలని అతన్ని చంపాను!'

'ఆమెకూ నీకూ ఏమిటీ సంబంధం ?'

'మంచికీ మానవత్వానికీ వున్న సంబంధమే!'

'మా కళ్లు కప్పాలని చూడకు. సరోజ నీ ప్రియురాలు. మీ యిద్దరి దారికి అడ్డు తగులుతున్నాడని శేషగిరిని హత్యచేసావు. అవునా ?'

'ఇక నేను చెప్పేదేమీ లేదు.'

'ఈ రివాల్వర్‌తోనేగా హత్యచేసావు ?'

'అవును.'

'ఎవరిదీ రివాల్వర్ ?'

రవి మౌనం వహించాడు.

'నువ్వు చెప్పకపోతే మేం తెలుసుకోలేం అనుకుంటున్నావా? ఇది రిటైర్డ్ మిలటరీ ఆఫీసరు రాజారావుగారిది!'

'... ... ...'

'ఇది ఆయనే నీకిచ్చారా ?'

'లేదు! వాళ్లకి తెలియకుండా దొంగతనంగా తెచ్చాను.'

'ఎప్పుడు వెళ్లావు వాళ్లింటికి ?'

'మొన్న! కాదు అటుమొన్న. కాదు గుర్తు లేదు.'

'ఐసీ! సరే! టూనాట్‌వన్ యితన్ని తీసుకెళ్లు.' ఆజ్ఞాపించాడాయన.

ఇంతలో రాజారావుగారు, జ్యోతి అక్కడికి వచ్చారు.

'రండి రాజారావుగారూ! మీతో పనుండి రమ్మనమని ఫోన్ చేసాను!'

'చెప్పండి. ఏమిటి ?' ఆయన ఆదుర్దాగా అడిగారు.

'మీ రివాల్వర్ మీదగ్గరుందా ?'

ఆ! ఎప్పుడూ నా కోటు జేబులోనే వుంటుంది. ఉండండి.' ఆయన తడుముకుని, 'సారీ! యింట్లో మర్చిపోయి వచ్చాను.' అన్నారు.

'అలాగా! యిది మీదేనేమో చూడండి.'

అది చేతిలోకి తీసుకోగానే ఆయన ఆశ్చర్యపోయారు.

'అరే! యిది నాదే! యిక్కడికి ఎలా వచ్చింది ?'

'రవి మీ యింటికి వస్తూండేవాడా ?'

'ఒకప్పుడు వచ్చేవాడు! ఇప్పుడు అభిప్రాయ భేదాలు వచ్చాయి మాకు. రావటం మానేసాడు.'

'ఒకప్పుడంటే ?'

'చాలా రోజు లయింది. నెలలు కావస్తోంది.'

'నిన్నగాని, మొన్నగానీ అతను రాలేదని మీకు రూఢిగా తెలుసా ?'

'బాగా తెలుసు! నేను యింట్లోనే వున్నాను.'

'మీ రివాల్వర్ మీరు ఎప్పుడు చూసినట్టు గుర్తు!'

'నిన్న వుదయం కూడా నా దగ్గరే వుంది.'

'ఐసీ! నిన్న మీ యింటికి ఎవరైనా వచ్చారా?'

ఆయన గుర్తు చేసుకున్నారు.

'చిదంబరం వచ్చాడుగా డాడీ!' జ్యోతి గుర్తు చేసింది.

'అవును! చిదంబరం అనే ఆయన తప్ప మా యింటికి వేరే వాళ్లెవరూ రాలేదు.'

'చిదంబరం ఎవరు ?'

'రవికి మేనమామ! యిప్పుడు తగాదాల్లో వున్న ఫాక్టరీ మేనేజరు కూడా!'

'అలాగా!' ఆయన పేరు నోట్ చేసుకున్నాడు.

'ఇనస్పెక్టర్‌గారూ! ఒక్కసారి రవిని నేను చూడవచ్చా ?' జ్యోతి అడిగింది.

'ఓ! యస్!' ఆయన అంగీకారంగా తల వూపాడు. 'ఏయ్! టూ నాట్ వన్! అమ్మాయిని రవి వుంచిన గది దగ్గరకి తీసుకెళ్లు.' అంటూ ఆజ్ఞాపించాడు.

రాజారావుగారు కోపం వచ్చినా ఏమీ అనలేక పోలీసు అధికారితో మాట్లాడుతూ కూర్చున్నారు.

జ్యోతి రవిని వుంచిన సెల్ దగ్గరకి వచ్చింది.

'రవీ!' పిలవలేక పిలిచింది.

పరధ్యానగా, తల దించుకుని, నుదుటమీద వేళ్లతో రాచుకుంటూ, ఆలోచనగా కూర్చుని వున్న రవి వులికిపాటుగా తలెత్తాడు. జ్యోతిని చూడగానే అతని ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

'జ్యోతీ!' లేచి చువ్వల దగ్గరకి వచ్చాడు.

'ఎందుకిలా అయింది రవీ! ఈ హత్య ఎవరు చేసారు ?'

ఆతని ముఖంలో ఆనందం మాయమై, బాధ, విచారం రెండూ ముప్పిరిగొన్నాయి!

'నేనే చేసాను జ్యోతీ!' అన్నాడు నిశ్చలంగా.

'అబద్ధం రవీ! నేను నమ్మను! నమ్మలేకుండా వున్నాను! నువ్వు చెయ్యవు. ముమ్మాటికీ చెయ్యవు! ఏ పాపిష్టివాళ్లో చేసి నీమీద తోసేసారు.'

'నీ మంచి మనసు, నా పట్ల గల అనురాగం అలా భ్రమని కలిగిస్తున్నాయి జ్యోతి! నేనే చేసాను!'

'రవీ! నిజం చెప్పు! ఏదయినా కాస్త ఆధారం దొరికితే, భూమి తల్లక్రిందులు చేసి అయినా సరే నిన్ను రక్షించుకుంటాను. చెప్పు రవీ!'

'నా పరిచయం ఒక పీడకలలా మర్చిపో జ్యోతీ! వెళ్లిరా!'

'రవీ! యిదేనా! యిదేనా నువ్వు చెప్పేది ? నాకు జీవితమే ఒక పీడకలలా అనిపిస్తోంది!' జ్యోతి పయిటచెంగు నోటి దగ్గర పెట్టుకుని ముఖం తిప్పుకుని గబగబా అడుగులు వేస్తూ వెళ్లిపోయింది.

## 57

'ఉరేయ్! వురేయ్! యిన్నాళ్లనుంచీ మీకు పెద్దదిక్కుగా వుండి, మిమ్మల్ని నమ్ముకుని, మీకింత చాకిరీ చేసిపెట్టినందుకు నాకు యిదిట్రా ప్రతిఫలం! ఓరేయ్ వేణూ! నన్నే యింట్లోంచి వెళ్లగొడుతున్నావుకదూ ? నీ పొగరు దేవుడు అణచకపోతే చూడు! నన్నిట్లా ఏడిపించినందుకు, నా వుసురు మీకు తగిలి మీరు సర్వనాశనం కాకపోతే నా పేరు చిదంబరమే కాదు! చిట్టీ! ఎక్కడే నువ్వు! రా! పోదాం! ఈ యిల్లు కాకపోతే మనకి ప్రపంచంలో చోటే లేదా! చూస్తాను! నన్నిలా బాధపెట్టిన మీరేం బాగుపడతారో నేనూ చూస్తాను!' అంటూ చిదంబరం యింటినిపడి అరుస్తున్నాడు.

ఉదయంనుంచీ వేణు నిప్పుమీద ఉప్పులా చిటపటగా వున్నాడు. అది యిందాక మాటా మాటాగా పెరిగింది. ఘర్షణ జరిగింది. వేణు చిదంబరం చొక్కా పట్టుకుని, 'యిప్పటివరకూ నువ్వు మాకు చేసిన మేలు చాలు! యిక నీకూ, మాకూ సంబంధం లేదు. నా యింట్లోంచి నడు బైటకి.' అని మెడబట్టి తోయటంతో, ఘర్షణ తారస్థాయికి చేరింది!

'రాధా! అమ్మాయి రాధా! చూసావుటే నీ మొగుడేమంటున్నాడో' అంటూ రంకెలు వేసాడాయన.

'లేకపోతే ఏమిటి నాన్నా! ఆరోజున కోర్టుకి ఎక్కొద్దు నాన్నా అని నేను చెవి నిల్లుకట్టుకుని పోరి చెబితే విన్నావా నువ్వు? యిప్పుడు చూడు! బావ, మామయ్యా మమ్మల్ని ఎంత అసహ్యంగా చూస్తున్నారో! అందరూ బాగుండాలని, మనమూ సుఖంగా వుండాలని అనుకోకుండా ఈ సంసారంలో ఎందుకిన్ని కలతలు పెట్టావు ? ఆ శేషగిరి తాగుబోతు అని తెలిసికూడా ఎందుకు చేరదీసినట్టు ? మమ్మల్ని మామయ్యా — బావలనుంచి కపటపు మాటలతో ఎందుకు విడదీసినట్టు ? నీ అలవాటు పోలేదు నాన్నా! యిదివరకు వూళ్లోవాళ్లందరి యిళ్లకీ నిప్పుపెట్టే నీ చెయ్యి, యిప్పుడు మా యింటికే పెడుతుంటే, చూసి వూరుకునేటంత మూర్ఖులం కాదు! నా సంసారం క్షేమంగా వుండాలంటే నువ్వు మాకు దూరంగానే వుండటం మంచిది!' నిష్కర్షగా రోషంగా అనేసింది రాధ.

**జరిగిన కథ: 17** రవి, వేణు పురుషోత్తంగారి కుమారులు. సరోజ,డాక్టర్ ప్రసాద్‌లు కూడా పురుషోత్తంగారివద్ద పెరిగారు. పురుషోత్తంగారి చిన్ననాటి స్నేహితుడు రాజారావుగారి సాయంతో ఫ్రూట్ కానింగ్ ఇండస్ట్రీ స్థాపిస్తాడు రవి. ప్రేమించిన శేషగిరిచే మోసగింపబడి ఆత్మహత్యకు పూనుకున్న సరోజ ఎలా క్లబ్‌డాన్సర్‌గా మారిందీ రవికి చెప్తుంది. జైలునుంచి విడుదలయిన శేషగిరి సరోజ సంపాదనంతా కాజేసేవాడని రవిని నిందిస్తాడు. సరోజ 'నర్స్' అవుతుంది. చిదంబరం ఎత్తుగడతో రాధ వేణుల వివాహం జరిపిస్తాడు రవి. శేషగిరి నాటిన విషబీజంతో రాజారావుగారు నిశ్చయించిన సంబంధాన్ని జ్యోతి రవిని వారికి పరిచయం చేసి చెడగొడుతుంది. రవి ఫ్యాక్టరీ బాధ్యత చిదంబరానికి అప్పగించి సింగపూర్ వెళతాడు. రవితో వివాహానికి రాజారావుగారు అంగీకరించకపోవటంతో క్షోభ చెందుతుంది జ్యోతి. శేషగిరి సరోజను వేధిస్తుంటాడు. రవి జీతాలిమ్మని డబ్బు ఇచ్చినా చిదంబరం జీతాలు ఇవ్వకపోవటంతో కార్మికులు సమ్మె ప్రారంభించారు. చిదంబరం వేణుల దుర్బుద్ధి తెలుసుకున్న రవి వారిని ఇంట్లోంచి వెళ్లగొడతాడు. వేణు రవి మీద దావా వేశాడు. శేషగిరి రవికి వ్యతిరేకంగా సాక్ష్యం చెపుతాడు. సరోజ జ్యోతితో మాట్లాడాలని వస్తుంది. కానీ రాజారావుగారు సరోజని వెళ్లగొడ్తారు. ఉమ కోర్టులో రవిని 'డాడీ' అని పిలవటం విన్న జ్యోతి క్రోధంతో రవి మాటలు వినకుండానే వెళ్తుంది. సరోజ తనగురించి పట్టించుకోక వెళ్లి పొమ్మంటుంది రవిని. రవి తాగుడుకు అలవాటు పడ్తాడు. తనకారణంగా పతనమవటాన్ని బాధతో చెప్తుంది సరోజ రవికి. రోజీయే సరోజ అని తెలుసుకున్న వేణు తన పొరపాటును జ్యోతికి వివరిస్తాడు. జ్యోతి రవిని క్షమార్పణ కోరుతుంది. చిదంబరం ప్రోద్బలంతో సరోజని చంపైనా తీసుకు వెళ్లాలని వచ్చిన శేషగిరి కాల్చి చంపబడతాడు. రవి హత్యా నేరం తనమీద వేసుకుంటాడు. కానీ జ్యోతి నమ్మలేదు.

'రాధా ! నువ్వు—నువ్వుకూడా వాడితో ఏకమై నన్ను కారుకూతలు కూస్తున్నావులే ! సరే ! మీరు పొమ్మంటే, దేవిరించుకుంటూ పడి వుండేందుకు, నేను కళ్ళూ, కాళ్లూ లేనివాడిని కాదుగా !' చిదంబరం రయ్యన లోపలికి వెళ్లి గబగబా బట్టలు సర్దుకున్నాడు. డబ్బు దాచిన పాత ట్రంకుపెట్టె తీసుకున్నాడు. రెండు పెట్టెలూ చేతపట్టుకుని 'చిట్టీ ! రా ! పోదాం ! ఈ రోజునుంచీ నాకు ఒక్కతే కూతురు అనుకుంటాను !' అని అరిచాడు.

ఆయన చిట్టిని తీసుకుని, గుమ్మం దాటబోతుంటే, పోలీసులు లోపలికి అడుగుపెడుతూ కనిపించారు ! వాళ్లని చూడగానే చిదంబరం ఖంగు తిన్నాడు.

'ఎవరి కోసం వచ్చారు మీరు ?' అని అడిగాడు.

'నీ కోసమే !'

చిదంబరానికి అనుమానం వేసింది ! ఒక్కసారి చేతిలో డబ్బు వున్న పాత ట్రంకుపెట్టె చూసుకున్నాడు. ఎందుకైనా మంచిది. సాధ్యమైనంత త్వరలో అక్కడ నుంచి బైటపడటం మంచిది అనుకున్నాడు.

'నడవండి. యింట్లోకి.' వాళ్లు అటకాయించారు.

'నేను వూరు వెళుతున్నానండీ ! మా అన్నయ్యకి చావుబ్రతుకులుగా వుందని టెలిగ్రాం వచ్చింది ! ట్రెయిన్‌కి టైమయిపోతోంది ! నేను అర్జెంట్‌గా వెళ్లాలి ! లోపల మా అల్లుడు వున్నాడు. మీకు కావాల్సిన అన్ని వివరాలూ చెబుతాడు !' అన్నాడు. ఆ క్షణంలో ఆయన ముఖం చూస్తే అదంతా అక్షరాలా నిజమేనేమో ననే భ్రమ కలిగించేట్టుంది.

'ఆ పెట్టెలో ఏముంది ?'

'అబ్బే ! ఏముంటుందండి ! ఏంలేదు ! నావి — మా చిన్నమ్మాయివి బట్టలు !' చిదంబరం సర్ది చెప్పేసాడు.

'నాన్నా ! ఏం లేదంటావేం ? యీ పాత ట్రంకుపెట్టె నిండా డబ్బుందిగా !' అంది చిట్టి అమాయకంగా.

'ఏమిటీ ! డబ్బా !' పోలీసులు అతని చేతిలో పెట్టె లాక్కున్నారు. చిదంబరం అందులో ఏం లేదని లబలబ లాడాడు.

ఈ గలభా విని అక్కడికి వచ్చిన రాధ — వేణు పోలీసుల్ని చూసి ఖంగారు పడ్డారు.

చిదంబరం పెట్టె తెరవనీయకుండా ఆయన ఓపిక వున్నంతవరకూ పెనుగులాడాడు ! ఇద్దరు పోలీసులు అతన్ని పెడరెక్కలు విరిచిపట్టుకుని ఆపారు !

పోలీసు అధికారి తాళం బద్దలుకొట్టి పెట్టె తెరిచాడు ! దాని నిండా నోట్ల కట్టలు కనిపించాయి!

'యింత డబ్బా !' వేణు కూడా ఆశ్చర్య పోయాడు.

'ఎక్కడిది యిదంతా ?' పోలీసులు చిదంబరాన్ని నిలదీసారు.

'అదా ! అది మా పూర్వీకులదండీ ! మా దొడ్లో పాదు పెడదామని నేల తవ్వితే యీ పెట్టె దొరికింది !' చిదంబరం కళ్లనీళ్ల పర్యంతం అవుతూ నీళ్లు నమిలాడు.

'ఉహూ ! అయితే లంకెబిందెలు దొరికాయన్న మాట ! నడు స్టేషన్‌కి ! అక్కడే చెబుదువుగాని యీ లంకెబిందెల కథంతా !' అన్నారు పోలీసులు.

'అక్కా ! పోలీసులు నాన్నని పట్టుకుపోతున్నా రెందుకు !' చిట్టి ఏడవసాగింది.

రాధ చెల్లెల్ని దగ్గిరకి తీసుకుంది.

## 58

కోర్టులో —

ప్రఖ్యాత డాన్సర్ మిస్. రోజీ ఒక హత్య తాలుకు కేసులో యిరుక్కుని, అరెస్ట్ అయిందని పేపర్లలో పెద్ద పెద్ద అక్షరాలతో, చూసిన చాలా మంది, ఆ కేసు స్వయంగా వినాలనే కుతూహలంతో, కోర్టంతా కిక్కిరిసిపోయారు !

సరోజ — రవి యిద్దరూ బోనుల్లో నిలబడి వున్నారు.

ప్రాసిక్యూటర్ సరోజని ప్రశ్నిస్తున్నాడు.

'సరోజగారూ ! శేషగిరితో మీకు పెళ్లి కాక ముందే రవి మీకు తెలుసా ?'

'తెలుసు !'

'ఎలా తెలుసు ?'

'మనసున్న మంచివాడుగా !'

'అది సరేనండీ ! నేను అడిగేది ఎలా తెలుసునని ? బంధువుగానా — స్నేహితుడిగానా ? పరిచయస్థుడిగానా ?'

'తోబుట్టువులాగా !'

'ఆహా ! అన్నా చెల్లెళ్లకే అమ్మాయి పుట్టిందా మేడమ్ ?' ఎవరో హేళనగా అరిచారు. మరుక్షణం కోర్టంతా నవ్వులతో ప్రతిధ్వనించింది.

రవి ఆ నవ్వులు పట్టనట్టు గంభీరంగా నిలబడినా, సరోజ మాత్రం దెబ్బతిన్న ఆడపులిలా చూసింది !

'ఆర్డర్ ! ఆర్డర్ !' అన్నారు జడ్జీగారు.

నవ్వులు సర్దుమణిగిన తర్వాత ప్రాసిక్యూటర్ మళ్లీ ప్రారంభించాడు.

'సరే ! మీ భర్త మిమ్మల్ని ఎందుకు వెళ్లగొట్టారు ?'

'అతను తాగుబోతు ! జూదరి !'

'అతను మిమ్మల్ని ప్రేమించి పెళ్లి చేసుకున్నాడని విన్నాను.'

'అది నా భ్రమ ! నేను మోసపోయాను !'

'మోసపోయింది అతనే అంటాను. శేషగిరి తాగుబోతు అవచ్చు ! అంతమాత్రాన మిమ్మల్ని వెళ్లగొట్టాల్సిన అవసరం అతనికేం లేదే ! అలా వెళ్లగొట్టాడంటే ఆ లోటు మీదే అయివుండాలి ! మీ అవినీతి ప్రవర్తనే దానికి కారణం అయి వుండవచ్చు !'

రవి ముఖం ఆవేశంతో కందింది.

'యువరానర్ ! ముద్దాయి నేరం చేసిందని అనుమానించే హక్కు తప్ప, ఆమె శీలాన్ని శంకించే హక్కు ప్రాసిక్యూటర్‌గారికి లేదని మనవి చేసుకుంటున్నాను.'

ప్రాసిక్యూటర్‌గారి కంఠం ఖంగుమంది.

'నో యువరానర్ ! ముద్దాయి శీలం నేను అనుమానించటంకాదు ! సివిల్ కోర్టులో — తన భార్య యీ రవితో లేచిపోయిందని, చనిపోయిన ఈమె భర్త, శేషగిరి, యిచ్చిన సాక్ష్యం కోర్టులో దాఖలు చేయబడివుంది ! కనుక—ప్రధానంగా ఆమె శీలమే ఈ హత్యానేరానికి మూలాధారం అని మనవి చేసుకుంటున్నాను !'

జడ్జీగారు తల పంకించారు.

'ప్రొసీడ్ !'

ప్రాసిక్యూటర్ మళ్లీ సరోజవైపు తిరిగాడు.

'సరోజగారూ ! మీ భర్తని మీరు వదిలేసి వచ్చారు ! మీ యిష్టం వచ్చినట్టు మీరు, స్వతంత్రంగా బ్రతుకుతున్నారు ! అయినా, అతను మీమీద ప్రేమని చంపుకోలేక, మీదగ్గరకి చాలాసార్లు వచ్చాడు. అవునా ?'

'నామీద ప్రేమతో కాదు! నాదగ్గర డబ్బుందేమోననే భ్రమతో!'

'భ్రమా! మీరు హోటల్ బ్లూస్టార్‌కి కాంట్రాక్టు వ్రాసి మీ నాట్యంతో బాగానే సంపాయించినారు కదండీ! అదంతా ఏం చేసారు?'

'దానం చేసాను!'

'కన్నబిడ్డ వుండగా దానం చేయాల్సిన అవసరం!'

'అవును కన్నబిడ్డకోసమే, సంపాయించాను! కానీ నా బిడ్డ బాధ్యత రవిగారు తీసుకున్నారు! ఆ డబ్బుతో నా కవసరం లేకపోయింది!'

'బిడ్డనుకన్న తండ్రి వుండగా, రవికి ఎందుకు అప్పచెప్పాల్సి వచ్చింది ఆ బాధ్యత? ఏమిటా ప్రత్యేకత?'

సరోజ సమాధానం చెప్పలేకపోయింది.

'సమాధానం చెప్పండి!'

సరోజ మాట్లాడలేదు.

'ఏం? అతనే పాపకి తండ్రా?'

'కాదూ! కాదూ! కాదు!' సరోజ కన్నీళ్లు బిగబట్టుకుంటూ బిగ్గరగా అంది. ముఖంలో ఆవేశం, బాధ వుప్పెనలా పొంగినాయి.

'నన్ను ఎన్నయినా అనండి! చెడిన మనిషి అని, కాలుజారిన మనిషి అని, నీతిలేనిదాన్ని, శీలం కోల్పోయినదాన్నని, ఎన్నయినా అనండి! ఎంతయినా నిందించండి! నిలదీయండి! ఈ పాప పంకిలంలోకి, దేవుడులాటి అతన్నిమాత్రం లాగకండి! మీకు పుణ్యం వుంటుంది!' సరోజ చేతులు జోడించింది.

'మనసిచ్చిన ఆడదానికి ప్రియుడెప్పుడూ దేవుడే!'

'నో స్టేట్‌మెంట్స్!' జడ్జీగారు అన్నారు.

'సారీ యువరానర్! చూడమ్మా! హత్య జరిగిన రోజు సాయంత్రం, మీ భర్త మీరు పని చేస్తున్న హాస్పిటల్‌కి వచ్చి మిమ్మల్ని రమ్మనమని బలవంతం చేస్తుంటే రవి వచ్చి విడిపించాడు! అవునా?'

'అవును!'

'కానీ మళ్లీ వస్తానని, నీ అంతు చూస్తానని నీ భర్త అయిన శేషగిరి వెళుతూ బెదిరించాడు.'

'అవును!'

'అన్నట్టుగానే, ఆ రాత్రి మళ్లీ గిరి నీ క్వార్టర్స్‌కి వచ్చి నిన్ను రమ్మనమని బలవంతం చేస్తుంటే, రవి వెనకనుంచి వచ్చి అతన్ని కాల్చాడు.'

'కాదు! గిరి నన్ను చంపబోతుంటే రివాల్వర్ పేలింది! తర్వాత చూస్తే ఆయన నిలబడివున్నారు. అంతేగానీ ఆయన కాల్చటం నేను చూడలేదు.'

'చూసినా చెబుతారని మేము అనుకోవటం లేదు! దట్సాల్ యువరానర్!'

## 59

భారంగా మూతలు పడివున్న పురుషోత్తంగారి కళ్లు మెల్లగా విడివడినాయి! ఆయన మంచం పక్కనే స్టూలు మీద కూర్చుని వున్న నర్స్ ఆయనకి మెలకువ రావటం చూసి, దగ్గరకు వచ్చి 'ఏంకావాలి?' అంది.

'రవి! రవి ఎక్కడ?' ఆయన పెదవులు

## నీవెవరు?

నా నిశీధపు గదిలో
ఒంటరిగా నేను
మిణుగురువై వెలిగావా క్షణం

ఏకాకిగా ఏటి వడ్డున
వేదనలో నేను
కలువవై వికశించావా క్షణం

ఈ ప్రపంచపు రాక్షస గొడవలో నేను
కోయిలవై ఆలపించావా క్షణం

ఎద తలుపులు తెరిచి
నిన్నాహ్వానిస్తే నేను
గుండె గాయాలు కెలికిపోయావీ క్షణం

— పసుపులేటి వెంకటరమణ

## బంగారు కలలు

అస్పష్టంగా పలికినాయి.

'రవిగారా! అయ్యో! ఆయన అరెస్ట్ అయారుగా! జైల్లో వున్నారు.' అంది నర్స్.

'ఏమిటి! అరెస్ట్ అయాడా?' ఆయన లేవబోయారు.

నర్స్ ఆయన్ని వారించి, బలవంతంగా, భుజాలు పట్టుకుని, వెనక్కు వాల్చి పడుకోబెట్టింది.

'అవును! మీకు తెలియదా? శేషగిరిని హత్య చేసారాయన. పోలీసులు పట్టుకున్నారు. కోర్టులో కేసు జరుగుతోంది! యివాళో రేపో తీర్పు చెబుతారని అనుకుంటున్నా రంతా!' అప్పుడే డ్యూటీకి వచ్చిన నర్స్‌కి ఆయనకి రవి విషయం చెప్పవద్దన్నారని తెలియక చెప్పేసింది.

'తీర్పా? రవికి శిక్ష!' ఆయన లేవబోయారు. కానీ సాధ్యం గాలేదు.

మరు నిముషంలో ఆయనకి మళ్లీ స్పృహ తప్పింది.

ఆయనకి మళ్లీ మెలకువ వచ్చేసరికి, ప్రసాద్ దగ్గరగా కూర్చునివున్నాడు.

వేణు, జ్యోతి, రాజారావు అందరూ ఆయన మంచం చుట్టూ నిలబడి వున్నారు.

'రవీ! రవీ!' కలవరిస్తున్నట్టుగా అన్న ఆయన చప్పున లేవబోయారు.

'మీరు లేవటానికి వీల్లేదు! బాగా విశ్రాంతి తీసుకోవాలి.' ప్రసాద్ గట్టిగా హెచ్చరించి, ఆయన్ని వెనక్కు ఆనించి పడుకోబెట్టాడు.

'నీకు తెలియదు ప్రసాద్! నన్ను కోర్టుకి తీసుకెళ్లండి! వెంటనే ఆ ఏర్పాటు చేయండి!'

'కోర్టుకా! మీరు మంచంమీద నుంచి కదలటానికి వీల్లేదు అంటుంటే!' ఇంజక్షన్ యిస్తూ అన్నాడు ప్రసాద్.

రాజారావుగారు దగ్గరకి వచ్చి, పురుషోత్తంగారి తలమీద చెయి వేసారు.

'గాభరా పడకు! విశ్రాంతి తీసుకో! అన్నింటి కన్నా నీ ప్రాణం ముఖ్యం!' అన్నారు అనునయంగా.

'లేదురా రాజా! లేదు! నే నేమైపోయినా ఫర్వాలేదు! నాలో యీ వూపిరి కాస్త వుండగానే, రవి నిర్దోషి అని తెలియచేయాలి! హత్య చేసింది ఎవరో నాకు తెలుసు! నన్ను కోర్టుకి తీసుకు వెళ్లండి! నాకు బాగానే వుంది! నన్ను ఆపకండి.' ఆయన వేయి ఏనుగుల బలం వున్న మనిషిలా లేచారు మంచంమీద నుంచి.

'ఆగండి! అంబులెన్స్ తెప్పిస్తాను.' ఆయన జబ్బ గట్టిగా పట్టుకుంటూ, గత్యంతరం లేని ప్రసాద్ అంగీకరించాడు.

## 60

కోర్టులో రవిమీద విచారణ ప్రారంభమైంది. ప్రాసిక్యూటర్ ప్రారంభించాడు.

'రవిగారూ! ఆస్తికోసం మీ తమ్ముడు మీమీద దావా వేసాడు కదండీ?'

'అవును. వేసాడు. కానీ యిప్పుడు చేసింది తప్పు అని తెలుసుకున్నాడు.'

'కావచ్చు! కానీ — మీరు చెడు అలవాట్లకి గురి అయి, డబ్బు పాడుచేస్తున్నారని ఆరోపిస్తూ, మీమీద కోర్టులో సాక్ష్యం చెప్పాడు. అవునా?'

'అవును.'

'ఊ! మిమ్మల్ని ప్రేమించిన అమ్మాయి కూడ మీకూ—సరోజకీ అక్రమ సంబంధం వుందని తెలియగానే మీకు దూరం అయింది కదూ?'

'అందరిలాగానే తనూ అపోహపడింది. అందుకు బాధపడింది.'

'హత్య జరిగిన తర్వాత అందరూ బాధపడవచ్చు. కానీ, ఈ హత్య జరగకముందు ఆమె మిమ్మల్ని తిరస్కరించింది! ఎంతో స్నేహంగా ఆత్మీయంగా వున్న రాజారావుగారి కుటుంబం, ఈ సరోజ సంగతి తెలియగానే మీపట్ల పెడముఖంగా అయారు. అవునా?'

'అవును!'

'రాజారావుగారు మీకు ఫాక్టరీ విషయంలో ఎంతో సహాయం చేసారు! కన్నతండ్రిలా ఆదుకున్నారు. ఆయన మనసుకూడా మీరు నొప్పించారు.'

రవి మాట్లాడలేదు.

'మీ స్వంత తమ్ముడు, మిమ్మల్ని ఆరాధ్య దైవంగా ప్రేమించిన అమ్మాయి, మిమ్మల్ని ఎంతో ఆపేక్షగా చూసిన రాజారావుగారు, యింత మంది దూరమైనా మీరు లెక్కచేయలేదు. మీరు సరోజనిగాని, ఆమె బిడ్డనిగాని వదులుకోటానికి సిద్ధపడలేదు!'

'వదులుకోవాల్సిన అవసరం నాకు కనిపించలేదు. వాళ్లందరూ నా విషయంలో పొరబడ్డారని నాకు బాగా తెలుసు!'

'సరోజ భర్త వచ్చి అన్నిసార్లు అడిగినా, ఆమెని మీరు కాపురానికి ఎందుకు వెళ్లనీయలేదు? అడుగడుగునా ఎందుకు అడ్డు తగిలారు?'

'శేషగిరి కోరినట్లుగా, అతనితో వెళ్లనిస్తే సరోజ వెళ్లేది కాపురానికికాదు! శ్మశానానికి!'

'అందుకే ఆమె భర్తని అక్కడికి సాగనంపారా మీరు?' వెంటనే తీక్షణంగా వచ్చింది ప్రశ్న.

'అవును!'

'ఆమెకోసం యిన్ని త్యాగాలు చేయటానికి, చివరకి హత్య కూడా చేయటానికి సిద్ధం అయారే మీరు! ప్రతి మనిషి చేసే ప్రతి చిన్నపని వెనకా,

ఏదో ఒక ఆలోచన వుంటుంది! యింత పెద్ద విషయంలో, మీరు యిలా చేయటానికి కారణం ఏమిటో చెప్పగలరా?'

'చెప్పను!'

'చెప్పరూ? ఎందుకని?'

'అది నా స్వవిషయం!'

'యువరానర్! నోట్ యిట్!' ప్రాశిక్యూటర్ రవిని నఖశిఖ పర్యంతం చూసాడు. 'ఊ! మిస్టర్ రవీ! శేషగిరి వచ్చి సరోజని చంపబోవటం మీకెలా తెలిసింది?'

'అర్ధరాత్రి సరోజ గదిలో నుంచి కేకలు వినిపించగానే నేను పరుగెత్తాను! నేను వెళ్ళేసరికి శేషు సరోజని కత్తితో పొడవబోవటం చూసాను! సహించలేక కాల్చేసాను!'

'మీరు అనుకోకుండా ఆ పని చేసేసారన్న మాట!'

'అవును!'

'అయితే ఆ క్షణంలో మీ చేతిలోకి రివాల్వర్ ఎలా వచ్చింది?'

'... ... ... ...'

'మాట్లాడరేమండీ?'

రవి ముఖం నిస్తేజంగా మారింది. రాయిలాంటి నిశ్చలత్వం ఏదో అతన్ని ఆవరించుకుంది.

'చెప్పండి.' ప్రాశిక్యూటర్ హెచ్చరించాడు.

'రివాల్వర్ వుంది! కాల్చేసాను! అంతకంటే నేను చెప్పగలిగిందేమీ లేదు!'

'చెప్పనవసరం లేదుకూడా!'

## 61

సరోజ — రవి యిద్దరూ బోనుల్లో నిలబడి వున్నారు

ప్రాశిక్యూటర్ ఖంగుమనే గొంతుతో చెబుతున్నాడు

'యువరానర్! సరోజ — శేషగిరుల వివాహానికి ముందే — వీళ్ళిద్దరికీ సంబంధం ఉందని సరోజే ఒప్పుకుంది. అది అక్రమ సంబంధం అని వేణు దావా, శేషగిరి సాక్ష్యం, జ్యోతి ఎడబాటూ తెలుపుతున్నాయి. అమాయకుడైన శేషగిరి, సరోజ మీద ప్రేమని చంపుకోలేక, మూర్ఖంగా పదేపదే ఆమెని మళ్ళీ తనదగ్గరకు రమ్మనమని ప్రాధేయపడుతూ, బతిమలాడటానికి వెళ్ళాడు. శేషగిరి రాకపోకలు వాళ్లకి పీడగా కనిపించాయి. అతన్ని ఎలాగైనా దారికి అడ్డం తొలగించటానికి నిశ్చయించుకున్నారు. వారి ఆలోచనకి ప్రాణం పోసినట్టుగా, దురదృష్టవంతుడైన శేషగిరి, ఆరోజు సాయంత్రం వెళ్ళి సరోజని తనతో రమ్మనమని బలవంతం చేసాడు! రవి ఆవేశంలో అడ్డుతగిలి, అతన్ని కొట్టి పంపేసాడు. ఆయుష్షుమూడిన శేషగిరి 'నేను మళ్ళీ వస్తానని' హెచ్చరించి వెళ్ళాడు తప్పక వస్తాడని వారిద్దరికీ తెలుసు. అందుకే ప్లాన్ చేసుకున్నారు. అందుకే రవి, ఆరాత్రి ఆయుధం సిద్ధం చేసుకుని రెడీగా ఉన్నాడు! లేకపోతె ఆ సమయంలో అతని చేతిలో రివాల్వర్ వుండాల్సిన అవసరం లేనేలేదు! వాళ్ళు అనుకున్న పథకం నెరవేరింది! శేషగిరి అన్నమాట ప్రకారం

# బంగారు కలలు

రానేవచ్చాడు! రవి అతన్ని హత్యచేసాడు? వార్డ్ బాయ్ అయిన గోపాలం అదృష్టవశాత్తూ రవిని పిస్టలుతో చూడనట్టయితే, అతను పరుగెత్తుకు వచ్చి పోలీసులకి ఫోన్ చేయకపోయినట్టయితే వీరిద్దరూ, ఏదోవిధంగా శేషగిరి శవం మాయంచేసి వుండేవాళ్ళు!

యువరానర్! కాబట్టి యిది అన్నివిధాలా ఆలోచించి చేసిన హత్య! కాబట్టి హత్యచేసిన మొదటి ముద్దాయి రవికి, అతన్ని ఈ హత్యకి ప్రోత్సహించిన రెండో ముద్దాయి సరోజకు, సరైన దండన విధించవలసిందిగా కోర్టువారిని కోరుతున్నాను.'

'కాదు! కాదు! ఆగండి! రవి ఈ హత్య చేయలేదు.' అప్పుడే కోర్టులో అడుగుపెట్టి, ఈ ఆఖరి వాక్యాలు విన్న పురుషోత్తం ఆవేశంగా అరిచారు. జ్యోతి — ప్రసాద్ — వేణు ఆయన్ని పట్టుకుని తీసుకువస్తున్నారు.

ఆయన్ని చూడగానే కోర్టులో కలకలం బైలుదేరింది.

జడ్జిగారు ప్రశ్నార్థకంగా చూసారు.

---

"డాక్టరుగారూ, మా తమ్ముడికి కొంచెం పిచ్చెక్కినట్లుంది. తనొక కోడిపెట్టనని వాదిస్తాడు." అని చెప్పాడు రామారావు వైద్యుడితో.

"అలాగా? ఎప్పటినుంచి?" అని ఆయన రామారావుని అడిగాడు.

"మూడునెలల నుంచి!" అని రా. రా.

"మూడు నెలలే! యింతకాలం ఏం చేస్తున్నట్టు?"

"నిజం చెప్పాలంటే సార్, మాకు గుడ్లు కొంచెం అవసరం అయ్యాయి!" అన్నాడు రామారావు ఇబ్బందిగా.

---

'ఎవరు మీరు?' ప్రాశిక్యూటర్ ప్రశ్నించాడు

'నా పేరు పురుషోత్తం! శేషగిరిని హత్య చేసింది నేను!'

'ఆ!' అందరూ తెల్లబోయారు.

'ఏమిటి మీరు అనేది?' తీక్షణంగా అడిగాడు ప్రాశిక్యూటర్.

'అవును! ఈ హత్య చేసింది నేను! కన్నబిడ్డకు జరుగుతున్న అన్యాయం చూసి సహించలేక, కసిదీరా అతన్ని కాల్చి చంపింది నేను!'

'కన్నబిడ్డా! ఎవరండీ మీ కన్నబిడ్డ?'

'ఈ అమ్మాయి! సరోజ నా కన్నబిడ్డ! రవి నా రక్తం! నా స్వంత కొడుకు! వాళ్ళిద్దరిమధ్యా ఎలాటి అక్రమ సంబంధం లేదు'

పురుషోత్తంగారు చెప్పసాగారు.

'అవును బాబూ! సరోజ నా కన్నకూతురు! నా రక్తాన్ని పంచుకు పుట్టినా, నన్ను 'నాన్నా!' అని పిలవటానికి నోచుకోని అభాగ్యురాలు! సరోజ తల్లి లక్ష్మి నా యింట్లో వంటమనిషిగా వుండేది! తల్లిలేని నా బిడ్డల్ని ఏ లోటూ లేకుండా, కన్నతల్లి కంటే మిన్నగా వాళ్ళ ఆలనా, పాలనా, చూసింది! నా పిల్లలిద్దరిమీదా ఆమె చూపే ప్రేమవలన, క్రమంగా లక్ష్మి అంటే నాకు అభిమానం పెరిగింది అభిమానం ఆత్మీయతగా మారింది! మా యిద్దరి అనురాగ ఫలితమే సరోజ!

సరోజకి 5 సం. వయసప్పుడు, విషజ్వరం వల్ల లక్ష్మి చనిపోయింది. సరోజని నా చేతులకి అప్పగించి, లక్ష్మి నిశ్చింతగా వెళ్లిపోయింది! ఆ సమయంలో సరోజకి ఏ లోటూ రానివ్వనని ఆమెకి వాగ్దానం చేసాను! కానీ పిరికివాణ్ణి! లక్ష్మిని చేరదీసేటప్పుడు అడ్డురాని కులాలు, అంతస్తులు, ఆమె బిడ్డని బహిరంగంగా నా కూతురని స్వీకరించటానికి అడ్డు వచ్చాయి!

సరోజ కూతురన్న మమకారం కూడా చంపుకుని, యీ లోకానికి భయపడి, పనిమనిషి పిల్లగానే నా యింట్లో పెంచాను! లోకం అంతా నా వుదార హృదయానికి పొగుడుతుంటే, నేను మనసులోనే తప్పు చేసినట్టు కృంగిపోయేవాడిని!

సరోజకి నేను తండ్రినని చెప్పకోకపోయినా, ఆమెకి ఏ లోటూ రాకుండా చూసాను! నా కొడుకులతో సమంగా పెంచాను.

కానీ — వయసు గడిచినకొద్దీ, నా ఆరోగ్యం దెబ్బతిని, నేను ముసలి మనిషిని అయిపోవటంతో, ఏ క్షణంలో ఎగిరిపోతానో అనే భయంతో, నా కేదయినా అయితే సరోజకి అన్యాయం జరుగుతుందేమోననే జంకుతో, ఈ రహస్యం నా పెద్ద కొడుకు అయిన రవికి చెప్పేసాను! నేనున్నా లేకపోయినా, సరోజ భవిష్యత్తు తీర్చిదిద్దే బాధ్యత అతనికి అప్పచెప్పాను! రవి కూడా సరోజని స్వంత చెల్లెలుగానే చూస్తూవచ్చాడు

సరోజకి ఏ లోటూ వుండకూడదు! ఆమెకి నామూలంగా జరిగిన అన్యాయం యింకోరకంగానైనా సరిచేయాలనే తలంపుతో, తలితండ్రులు లేని ప్రసాద్‌ని చేరదీసాను! అతనికి రవితోపాటు ఉన్నత చదువులు చెప్పించి, అతనికి సరోజని ఇచ్చి పెళ్ళిచేయాలని కలలుకన్నాను! కానీ దైవ నిర్ణయం వేరుగా వుంది! కాలం, కన్నెతనం, అమాయకత్వం సరోజని మా యింటినుండి దూరంచేసాయి! సరోజ శేషగిరిని ప్రేమించి వెళ్లిపోయింది. ఇది తన యిష్టప్రకారం జరుగుతున్న పెళ్లి గాబట్టి, మమ్మల్ని కలిపించుకోవద్దని, శేషగిరిని ఏమీ అనవద్దని వుత్తరం వ్రాసిపెట్టి వెళ్లింది! పోనీ అనుకున్నాను! తను ఎక్కడో అక్కడ సుఖంగా, ఆనందంగా వుంటే అంతేచాలు అనుకున్నాను. కానీ ఒక రోజు రాత్రి సరోజ మళ్ళీ మా యింటికి వచ్చింది! తనని శేషగిరి మోసంచేసాడని, తన బ్రతుకు అధ్వాన్నం అయిపోయిందని, జీవితంమీద విరక్తి పుట్టింది కాబట్టి, ఆత్మహత్య చేసుకుంటున్నానని, తనని క్షమించమని వుత్తరం వ్రాసి, మా గుమ్మంలో పెట్టి, మాకు కనిపించకుండా వెళ్లిపోయింది

ఆనాడు నేను పడిన వేదన వర్ణించనలవి కానిది! పైకి చెప్పుకోలేని ఈ బాధని, అనుక్షణం చిత్రహింస అనుభవిస్తూ, మూగగా భరించాను!

కానీ — కానీ — విధి ఆడించిన బొమ్మల్లా, సరోజ — నేను మళ్లీ కలుసుకున్నాం! చచ్చిపోయిందనుకున్న సరోజ మళ్ళీ నన్ను బ్రతికించటానికే అన్నట్టు నర్సుగా నా కళ్లముందు నిలబడింది!

సరోజ జీవితం శేషగిరి మూలంగా ఛిన్నాభిన్నం అయింది! కానీ ఎంతో సహనంతో, సగం చచ్చిన మనిషిలా, తన కూతురుకోసం, పది మందికీ తన జీవితం ఉపయోగపడాలని, నర్సుగా సేవలు చేస్తూ, బలవంతంగా బ్రతకటానికి ప్రయత్నిస్తుంటే, శేషగిరి, ఆ దుర్మార్గుడు, మాటిమాటికీ వచ్చి ఆమె బ్రతుకుని అల్లరిపాలు చేస్తూ, అవమానిస్తుంటే, నేను కళ్ళారా చూసి భరించలేకపోయాను! ఆ రాక్షసుడు బ్రతికి వున్నంతకాలం నా బిడ్డకు రక్షణ, సుఖం రెండూ లేవనుకున్నాను!

శేషగిరి వచ్చి గొడవచేసి వెళ్ళిపోయిన ఆ సాయంత్రం — నన్ను చూడటానికి నా స్నేహితుడు రాజారావు వచ్చాడు. మాటల సందర్భంలో, అతనికి తెలియకుండా, అతని జేబులోనుంచి, రహస్యంగా రివాల్వర్ తీసుకుని దాచాను!

నేను భయపడ్డట్టుగానే, ఆ రాత్రి తిరిగి మళ్ళీ శేషగిరి వచ్చాడు! మంచంమీద నిద్రపట్టక, అశాంతిగా కూర్చున్న నాకు, సరోజ కేకలు వినిపించాయి! వాడే వచ్చివుంటాడనుకున్నాను! పిస్టల్ తీసుకుని, ఆవేశంతో, గబగబా, పడుతూ, లేస్తూ పరుగెత్తాను. నేను వెళ్ళేసరికి శేషగిరి సరోజని కత్తితో పొడవబోతున్నాడు! నేను వెంటనే యింకే ఆలోచన లేకుండా కాల్చేసాను! ఆ క్షణంలో సరోజని బ్రతికించుకోవాలనే వెర్రి కోరిక తప్ప నాకింకేం తెలియలేదు! యింకేం గుర్తురాలేదు! కానీ, నా వెనకే రవి పరుగెత్తుకు రావటం నేను చూడలేదు!

'నాన్నా!' రవి చప్పున నా చేతుల్లోంచి రివాల్వర్ తీసుకున్నాడు.

'సరోజని బ్రతికించటానికి యీ పని చేసానురా!' అన్నాను.

ఆ తర్వాత ఏమైందో నాకు తెలియదు! కళ్ళముందు చీకట్లు కమ్మటంతో, నేలకి ఒరిగి పోయాను! నాకు స్పృహ తప్పిపోయింది! యువరానర్! యిదీ జరిగిన సంగతి! మృత్యుముఖంలో వున్న నేను, యిప్పుడో, కాసేపో, అన్పిస్తున్న నేను ఈ క్షణంలో అబద్ధం చెప్పటంలేదు!' ఆయన నిలబడలేనట్టుగా, రవి నిలబడిన బాక్సు పట్టుకుని, కూలబడ్డారు.

రవి చప్పున దిగి వచ్చాడు.

'బాబూ రవీ!' ఆయన చెయిజాచారు.

రవి చప్పున ఆయన దగ్గరకి వచ్చాడు.

'నాన్నా!'

'పిల్లలు చేసిన తప్పుల్ని తలితండ్రులు కడుపులో పెట్టుకుని, దాచుకోవటం లోక రివాజు! కానీ అది మన విషయంలో మాత్రం వ్యతిరేకం అయింది! తండ్రి చేసిన పాపాన్ని ప్రపంచానికి తెలియకుండా, కాపాడాలని, యిన్ని అవమానాలు, అభాండాలూ సహించావు! బంగారంలాంటి నీ భవిష్యత్తు బలిచేసుకున్నావు! తమ్ముడు దావావేసి నానా యిబ్బందులూ పెడుతుంటే, నాకు తెలిస్తే ఎంత బాధపడతానో అని, తెలియకుండా జాగ్రత్త పడ్డావు! ఇంత అగ్ని మనసులో దాచుకుని కూడా, మన వూరు వచ్చినప్పుడు చిరునవ్వు చెక్కుచెదరకుండానే, ప్రవర్తించావు! నాన్నా యిదీ సంగతి అనలేదు! నీలాటి కొడుకుకి తండ్రినని చెప్పుకునే అర్హతకూడా నాకు లేదేమోరా!'

'అలా అనకు నాన్నా! సరోజ చూడు! ఎలా నిలబడిపోయిందో!'

'అమ్మా! సరోజా!'

బిత్తరపోయినట్టు చూస్తున్న సరోజ ఆయన పిలుపుకి మంత్రముగ్ధ అయినట్టుగా, మెల్లగా దగ్గరకు వచ్చింది. ఆమె కళ్ళలో — తనని తానే నమ్మలేని. ఆశ్చర్యం, సంభ్రమం కనిపిస్తోంది!

'అమ్మా! సరోజా! ఈ తండ్రిని చూస్తే అసహ్యం వేస్తోందా? ఈ — పిరికివాడిని క్షమించమ్మా!' ఆయన చేతులు జోడించబోయారు.

'బాబుగారూ!' సరోజ చప్పున వారిస్తూ ఆయన చేతులు పట్టుకుంది.

'కాదమ్మా! నాన్నా అని పిలు! ఒక్కసారి మనసారా పిలు!'

'నాన్నా!' సరోజ పెదవులు కంపించినాయి.

'చాలమ్మా! చాలు! నీచేత 'నాన్నా' అని పిలిపించుకోవటంతో, ఈ జన్మంతా నేను పడిన వేదన తీరిపోయినట్టుందమ్మా! నాకు చాలా తేలికగా వుంది! చాలా హాయిగా వుంది!'

'నాన్నా!' రవి ఆయన్ని పొదివి పట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు.

ఆయన ముఖ కవళికల్లో వస్తున్న మార్పు గమనించిన ప్రసాద్, ఆయన దగ్గరకి వచ్చి, చెయి పట్టి చూసాడు.

'రవీ! నాన్నగారిని సాధ్యమైనంత త్వరలో హాస్పిటల్‌కి తీసుకెళ్ళటం మంచిది!' అంటూ ఆదుర్దాగా హెచ్చరించాడు.

'అలాగే!' రవి తండ్రిని లేవదీయబోయాడు. వేణు, రాజారావుగారు కూడా సాయం చేయటం కోసం దగ్గరకు వచ్చారు.

పురుషోత్తంగారి చెయి రవి చేతిని గట్టిగా పట్టుకుంది! ముఖంనిండా చిరుచెమటలు అలుముకున్న ఆయన, ఒక్కసారి అందరినీ కళ్ళారా చూసుకున్నారు.

'రవీ! యింకెందుకురా హాస్పిటల్‌కి —' ఆయాసంగా అన్నారు. ఆయన కళ్ళ మూతలు పడినాయి.

'నాన్నా!' సరోజ, రవి — వేణు ఘొల్లుమన్నారు.

## 62

పురుషోత్తంగారి అంత్యక్రియలు ముగిసినాయి!

చిదంబరానికి నాలుగు సంవత్సరాలు కఠినమైన శిక్ష పడింది!

రాజారావుగారు జ్యోతి — రవిల వివాహం నిరాడంబరంగా జరిపించారు. రవి — జ్యోతి వధూవరులుగా వచ్చి నమస్కరిస్తుంటే, ఆయనకి కళ్ళు చెమ్మగిల్లినాయి! పురుషోత్తంగారి ఫొటో చూస్తూ, 'వాడికి నమస్కరించండిరా! ఈ క్షణం కోసం వాడు తపించిపోయాడు!' అన్నారు. యిద్దరి భుజాల మీద చేతులు వేసి పట్టుకుని తనే ఫొటో దగ్గరకు తీసుకెళ్ళి, 'పురేయ్! మనం కలలు కన్నట్టుగా, మన పిల్లలిద్దరికీ పెళ్ళి చేసానురా! ఈ ఆనందం నాతో పంచుకోటానికి నా పక్కన లేకుండా వెళ్ళిపోయావు!' అన్నారు.

వేణు, రాధ, ప్రసాద్ కూడా అక్కడికి వచ్చారు.

రవి — జ్యోతి పురుషోత్తంగారి ఫొటోకి నమస్కరించారు.

'రవీ! మీ నాన్న అదృష్టవంతుడు! ఆయన కోరుకున్న వన్నీ జరిగినాయి! ఆయన ఆత్మకి తప్పకుండా శాంతి కలుగుతుంది!' అన్నారు రాజారావుగారు.

రవి ముఖంలో విషాదం ఆవరించుకుంది.

'లేదు అంకుల్! ఆయన అసంతృప్తితోనే వెళ్ళిపోయారు! ఆయన బ్రతికి వున్నంతకాలం, సరోజ జీవితం చక్కచేయలేక పోయాననే వేదనతో కుమిలిపోయారు!' అన్నాడు.

అక్కడే వున్న ప్రసాద్ అన్నాడు. 'రవీ! నా జీవితానికి వెలుగు మీ నాన్న! నేను నీకో మాట చెప్పాలని అనుకుంటున్నాను! ఇన్నాళ్ళూ నా వృత్తిలో భాగం పంచుకుంది సరోజ! ఆమెకు అభ్యంతరం లేకపోతే, ఆమెను నేను జీవిత భాగస్వామిని చేసుకుంటాను! ఈ రూపంగానైనా మామయ్య ఆత్మకి శాంతి చేకూర్చి నా ఋణం తీర్చుకుంటాను!'

'ప్రసాద్!' రవి సంభ్రమంగా చూసాడు.

(30వ పేజీ చూడండి)



## తమ్ముడి పెళ్లి - మాయ భరతం

రామకృష్ణా సినీ స్టుడియోస్ (హైదరాబాద్) తలపెట్టిన తరువాతి చిత్రం యిది. ఈ కథను 'సత్యరత్న' వ్రాశారు. మాటలను డి. వి. నరసరాజు రచించారు. ప్రధాన భూమికను రామారావు ధరిస్తారు. ఆయన తమ్ముడి పాత్రను చిరంజీవి. బాలకృష్ణ పోషిస్తారు.



''ధనవంతులు—గుణవంతులు''లో రాజసులోచన

# సినిమా

''తాతమ్మ కల'' చిత్రం పూర్తయింది. ఈ చిత్రం ఎప్పుడొస్తుందా అని ప్రేక్షకులు కలలు గంటున్నారు. ఎన్నో ఆశలు పెంచుకున్నారు. ఈ చిత్రానికి కథకుడు, దర్శకుడు, నాయకుడు ఎన్టీఆర్ గాబట్టి చిత్రం సర్వాంగసుందరంగా వచ్చి వుంటుంది. ఈ చిత్రంలో రామారావు, భానుమతి పోటీపడి నటించిన ఘట్టాలు ఎన్నో వున్నాయి. వీళ్లిద్దరికి ఏమాత్రం తగ్గకుండా చిరంజీవి. బాలకృష్ణ నటించారు. సహాయ పాత్రలను కాంచన, శుభ, హరికృష్ణ, రాజబాబు, ఎం. పి. ప్రసాద్ పోషించారు. ఈ చిత్రానికి డి. వి. నరసరాజు, రాజేశ్వరరావు సాహిత్య సంగీతాలను సమకూర్చారు. నిర్మాత : త్రివిక్రమరావు.

### "ఓ సీత కథ"లో పాత్రల స్వభావాలు

సావరిన్ ఎంటర్ ప్రైజెస్‌వారి ''ఓ సీత కథ'' చిత్రములో అగుపించే అన్ని పాత్రలను గూర్చి క్లుప్తంగా వివరిస్తాను. ఈ వివరణవల్ల విశ్వనాథ్ వ్రాసిన ''ఓ సీత కథ''ను గూర్చి పాఠకులు తెలుసుకోవచ్చు.

**సీత :**

అక్కయ్య కోసం, అమ్మ కోసం మహోత్తర త్యాగాన్ని చేసిన పదహారణాల ఆంధ్రవడుచు. తన్ను నాశనం చెయ్యాలనుకున్న మనిషిలో పరివర్తనను కలిగించి, మంచి మనిషిగా మార్చిన మహిళ. ఈ పాత్రను రోజారమణి పోషించింది.

**సావిత్రి :**

హరికథలు చెప్పి కుటుంబాన్ని కాపాడిన కష్టజీవి. వెర్రెత్తి మాటకు కట్టుబడి, 'పెండ్లికి అంగీకరించిన వనిత. ఆత్మగౌరవం గల స్త్రీ. ఈ భూమికను శుభ ధరించింది.

**సుందరం :**

నిజాన్ని నిర్భయంగా చెప్పే మనస్తత్వం. మాయా ప్రపంచంలో బ్రతకనేర్వని అమాయక జీవి. తెలివితేటలు పెరగకపోయినా, మనసు కొండంత పెంచుకున్న వుత్తముడాయన. ఈ వేషాన్ని రమాప్రభ వేసింది.

**చలపతి :**

తండ్రి చేసిన తప్పును తన మంచితనంతో మరిపించిన మనవాడు. మగదరిపై అతలు పెంచుకుని, బంగారు కలలు గన్న నిజాయితీపరుడు. దీనిని చంద్రమోహన్ చేపట్టాడు.

**మాధవరావు :**

అప్పుడప్పుడు భావాలు గొన్నవాడు. తండ్రి నెదిరించి అనుకున్న పనిలో విజయం సాధించాడు. ఈ పాత్రను కొత్త నటుడు శ్యామసుందర్ పోషించాడు.

**గోపాలకృష్ణ :**

డబ్బులో ఏదయినా కొనవచ్చు అనేది వింత వేదాంతం గలవాడు. చివరికి డబ్బుకన్నా విలువయినది ఏదో అర్థం చేసుకుని తల వంచినవాడు. ఈ భూమికను దేవదాస్ కనకాల ధరించాడు.

**విశ్వనాథరావు :**

మంచివారి మాటకు తల వొగ్గడం జీవితాశయంగా గొన్నవాడు. మంచిని గౌరవించే యీ పాత్రను కాంతారావు ధరించాడు.

**మండేశ్వరరావు :**

డబ్బుకు గడ్డి తినేరకం. కన్నజోలు పెట్టు కొండే పూర్తిగా కనిపించదు. ఎవరినీ నమ్మడు. నిజాన్ని ఒప్పుకోడు. ఈ భూమికను అల్లు రామలింగయ్య ధరించాడు.

పైన పేర్కొన్న ఎనిమిది పాత్రల చుట్టూ ''ఓ సీత కథ'' చిత్రం నడుస్తుంది. ఈ చిత్రాన్ని వాస్తవానికి దగ్గరగా వుండేట్టు విశ్వనాథ్ రూపొందించారు. ఈ చిత్రాన్ని మాధవరావు పాత్రను పోషించిన శ్యామసుందర్ నిర్మించారు.

### బంజరులో బంగారం

పండించిన పొలేడుగా కృష్ణ నటిస్తున్న ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ వారి ''కొత్తకాపురం'' చిత్రం సగంపైగా పూర్తయినట్టు నిర్మాత జి. వెంకటరత్నం చెప్పారు. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

అనాథగా వచ్చిన మనిషికి ఆశ్రయమిచ్చిన ధర్మదాతగా ఎస్వీరంగారావు ''కొత్తకాపురం''లో ప్రధాన పాత్రను పోషిస్తున్నారు. ఆయన ఏకైక కుమార్తెగా భారతి నటిస్తున్నది. హాస్య పాత్రలను పద్మనాభం, రమాప్రభ, అల్లురామలింగయ్య, సూర్యకాంతం ధరిస్తున్నారు. కథను కళ్యాణ్ జగన్నాథ్ వ్రాయ, సంగీతాన్ని మహదేవన్ సమకూరుస్తున్నారు.



''ఓ సీత కథ''లో రోజా, కాంతారావు

''[illegible]''లో విజయలలిత



# డూండీతో ఇష్టాగోష్ఠి

అన్ని శాఖలలోనూ నిశితమైన పరిజ్ఞానం, అనుభవం వుండికూడా, నిర్మాతగానే వుంటూ, పరోక్షంగా తన మేధా సంపత్తిని పనికొస్తారు అనుకున్న వ్యక్తులకు పంచిపెట్టి, ఆయా శాఖల్లో వారిని పండితులను చేసాడొక వ్యక్తి. "గూఢచారి 116" చిత్రం నిర్మించి, క్రైయిమ్ చిత్రాలకొక అంతస్తును, గుర్తింపును తీసుకొచ్చాడా వ్యక్తి. "మరపురాని కథ" చిత్రం ద్వారా ప్రతిభ వుంది అనుకున్న ఒక తారను ప్రయోజనం వున్న పాత్ర ద్వారా పరిచయం చేసి, నేర్పు వున్న వాళ్ళు కరువయ్యారా అనుకుంటుండిన వ్యక్తుల అసంతృప్తికి ఓ దారి చూపించాడా వ్యక్తి. ఇంతకీ ఎవరా వ్యక్తి! పదునెనిమిది వత్సరాలుగా పరిశ్రమలో వుంటూ, ప్రతి చిన్న విషయాన్ని సుదీర్ఘంగా ఆలోచించి, ఆచరించే డూండీశ్వరరావే.

ఇంతవరకు నిర్మాతగా వుంటూ, నేడు దర్శకత్వం అనే క్రొత్త బాధ్యతను స్వీకరించిన సందర్భంగా కొన్ని విషయాలపై వారితో భేటీ జరిపాను.

ప్ర: నిర్మాతగా మీరు ఆర్జించిన అనుభవంతో నవ నిర్మాతలకు మీరిచ్చే సలహా ఏమిటి?

జ: క్రొత్తవాళ్ళు రావాలి, కావాలి. అప్పుడే పరిశ్రమ స్థంభీభూతం కాకుండా, పదికాలాలపాటు నిలుస్తుంది. అన్ని పరిశ్రమలకుమల్లె ఈ పరిశ్రమకు ప్రత్యేకమైన ఫార్ములా అంటూ ఏదీ లేదు. అలాగని, తొందరపాటు పనికిరాదు. నిర్మాతగా అడుగు వేసేముందు చిత్ర పరిశ్రమకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలను, సూచనలను కొస్త పరిశీలించి, పథం త్రొక్కడం సమంజసం, సముచితం అని నా భావం. ఒక చిత్రం విజయం సాధిస్తే, అందుకు అందరూ కారకులు అంటారు. కాని అదే చిత్రం మధ్యలో ఆగిపోవడం జరిగితే నిర్మాతే బాధ్యుడు అంటారు. అందుకే అన్ని విషయాలను జ్ఞప్తియందుంచుకొని రంగప్రవేశం చేయడం శ్రేయస్కరం.



"కృష్ణవేణి"లో రాజబాబు

### ప్రత్యేక కారణం

ప్రశ్న: ఇన్నాళ్ళుగా లేని బాధ్యతను అంటే దర్శకత్వంను ఈనాడు చేపట్టడానికి ప్రత్యేకమైన కారణం ఏదైనా వుందా?

జ: నావాళ్ళు, నేను అనుకున్న విధంగా చిత్రాన్ని రూపొందించగల సమర్థులు సమయానికి నాకు అందుబాటులో లేకపోవడం, ముక్కూ, మొహం తెలియని వ్యక్తికి గురుతర బాధ్యత నిచ్చి బాధపడడంకన్నా, నాకు నేనుగా నిలబడి చిత్రాన్ని చిత్రించగలనన్న నమ్మకం నాలో ఏర్పడడం — ఈ రెండు కారణాలే నన్ను దర్శకుడ్ని చేసాయి.

ప్ర: ఒక భాషలో దెబ్బతిన్న చిత్రాన్ని మరొక భాషలో పునః నిర్మించడం, ఒక భాషలో హిట్ అయిన చిత్రం మరొక భాషలో గూడా విజయవంతమౌతుందని చిత్రాలు నిర్మించడం; వీటిపై మీ అభిప్రాయం ఏమిటి?

జ: ఒక భాషలో అపజయాన్ని పొందిన చిత్రం మరొక భాషలో గూడా ఫెయిల్ కావాలన్న సిద్ధాంతం ఏమీలేదు. ఒక భాషా వ్యక్తులకు ఒక రకం మూసలో తీసిన చిత్రం నచ్చకపోవచ్చు. కానీ అదే చిత్రం మరొక భాషా వ్యక్తులకు నచ్చవచ్చు. ఉదాహరణకు "నిత్యకళ్యాణం — పచ్చతోరణం" చిత్రం తెలుగులో పెద్ద పేరు సంపాయించలేక



''మాంగల్య భాగ్యం''లో జగ్గయ్య, జయంతి

## సినిమా

పోయింది. కానీ అదే చిత్రం ''దాదీమా'' పేరుతో హిందీలో విజయఢంకా మ్రోగించింది. కొన్ని కొన్ని సెంటిమెంట్సు అన్ని భాషల వారికి సమన్వయిస్తాయి. అలాంటప్పుడే ఒక భాషలో హిట్ అయిన చిత్రాన్ని మరొక భాషలో తీయడం అనేది సాధారణంగా జరుగుతుంటుంది. అలా చేయడం తప్పుకాదు అని నా భావన. ఒక ప్రయోజనాత్మకమైన అభిప్రాయాన్ని, విస్తారపరచడంలో తీసుకునే శ్రమ విఫలం కావడం అనేది అరుదుగా జరిగే సంఘటన. అందుకే ఒక భాషా చిత్రాన్ని మరొక భాషలో నిర్మించడం జరుగుతోంది.

### పాటల పాత్ర

ప్ర: చిత్రంలో పాటల చిత్రీకరణ పాత్ర ఎంత? చిత్రం కలర్‌లో నిర్మించడం మూలంగా కలిగే లాభం ఏమిటి?

జ: తెలుగు చిత్రాల ప్రసక్తి తీసుకుంటే, చిత్ర విజయానికి పాటల చిత్రీకరణ, సంగీతం, నృత్యం కొంతవరకే దోహదం చేస్తాయి. కథ బాగుండి అన్ని హంగులు బాగున్నప్పుడు, పాటల చిత్రీకరణ కూడా బాగుంటే, నూరు రోజులు ఆడే చిత్రం, నూట యిరవై అయిదు రోజులు ఆడుతుంది. కానీ హిందీ చిత్రాల విషయంలో పాటల చిత్రీకరణ చిత్ర విజయానికి ప్రాణం లాంటిది. కొన్ని కొన్ని హిందీ చిత్రాలు కేవలం సంగీతం, దృశ్య చిత్రీకరణ మూలంగానే హిట్ అవుతున్నాయి చిత్రాన్ని కలర్‌లో నిర్మించడం మూలంగా, నేత్రపర్వమైన చిత్రీకరణను చూపించవచ్చు అని నిర్మాతలు, చూడవచ్చు అని ప్రేక్షకులు వూహిస్తారు. సాధారణమైన యింటికి, మొసాయిక్ ఫ్లోర్ వేసి, అలంకరణ చేసివున్న యింటికి ఎంత భేదం కన్పడుతుందో, కలర్, బ్లాక్ అండ్ వైట్ చిత్రాల మధ్య అంత తేడా వుంది ముఖ్యంగా అవుట్‌డోర్ చిత్రీకరణకు కలర్ ఎంతో ఉపకరిస్తుంది. నిర్మాణ వ్యయం చూస్తే, కలర్‌కు బ్లాక్ అండ్ వైట్‌కు బోలెడు వ్యత్యాసం వుంది తెలుపు – నలుపు చిత్రాల నిర్మాణానికి రెండింతలౌతుంది కలర్ చిత్ర నిర్మాణం పది లక్షలు ఖర్చుపెట్టి బ్లాక్ అండ్ వైట్ చిత్రం తీస్తే, వసూళ్లు పదిహేను లక్షలు వస్తే, కనీసం అయిదు లక్షలన్నా లాభం మిగుల్తుంది కానీ అదే ఏ నలభై లక్షలో పెట్టి కలర్ చిత్రం నిర్మిస్తే, వసూళ్లు మాత్రం నలభై అయిదు దాటడంలేదు. అంటే తెలుపు – నలుపు చిత్రాల ద్వారా వచ్చే లాభంలో సగం కూడా ఒక్కోసారి రాకుండా పోవడం జరుగుతోంది

### నష్టం ఎంత?

ప్ర: దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు ఈసారి రెండు కోట్లు నష్టం వచ్చిందని అంటున్నారు ఈ నష్టంలో తెలుగు చిత్రాల శాతం ఎంత?

జ. నష్టం రాకుండా ఎలావుంటుంది ప్రభుత్వం ఈ పరిశ్రమకు మద్దత్తు చెయ్యకపోవడం అటుంచి, వినోదపు పన్నును విపరీతంగా పెంచేయడం మూలంగా వసూళ్లు తగ్గుముఖం పట్టడం, నిర్మాత పెట్టుబడికి నష్టం వాటిల్లడం జరుగుతోంది విడుదలయ్యే చిత్రాల రద్దీ, నిర్మితమయ్యే చిత్రాల సంఖ్య పెరుగుదల కారణంగా కొన్ని చిత్రాలు ఘోర పరాజయాన్ని పొందుతున్నాయి రోజు రోజుకి చిత్రాలు నిర్మించే వ్యక్తులు పెరుగుతున్నారేగానీ, తరగడంలేదు అదృష్టమున్నవాడు అందలం ఎక్కుతున్నాడు అదృష్టం లేనివాడు అందుకోవడానికి ఏమీ లేకుండా మిగిలిపోతున్నాడు మన తెలుగు చిత్రాలు కూడా ఒక నెలలో అయిదు చిత్రాలు విడుదలైతే ఒకటి, రెండు చిత్రాలు నిలబడడానికే ఎంతో ఇబ్బందిగా వుంది. పై నష్టంలో మనదికూడా కొంత శాతం వుంది.

### ద్విపాత్రాభినయం ఆవశ్యకత

ప్ర. ద్విపాత్రాభినయానికి ఒకే వ్యక్తిని ఎన్నుకోవడంలో అర్థం ఏమిటి?

జ. మనిషిని పోలిన మనిషి వున్నపుడు జరిగే పర్యవసానం ఎప్పుడూ గమ్మత్తుగానే వుంటుంది కథలో, కథనంలో ఒకవిధమైన థ్రిల్ తీసుకురావడానికి ఒకే వ్యక్తిని రెండు పాత్రలకు ఎన్నుకోవడం జరుగుతుంది. ఇద్దరు సోదరులు ఒకే రకంగా వున్నారు – లేక తండ్రీ – కొడుకు ఒకే



''మంచి మనుషులు''లో ఒక దృశ్యం

# అనిత 16 ఏళ్ల వనిత, ఇప్పుడిప్పుడే పరులదృష్టి నాకర్షించుటలోనున్న అనుభూతిని గ్రహిస్తోంది






మిలమిలా మెరిసే ఆమె
చర్మాన్ని సంరక్షిస్తూన్నది—
శుద్ధమైన, సున్నితమైన
సహజమైన సోపు.

## మైసూర్ శాండల్

మైసూర్ శాండల్ సోపు. మీ
చర్మాన్ని నిర్మలంగా, మృదువుగా మరియు
మిలమిలా మెరిసేటట్లు వుంచడానికి.

తయారుచేయువారు
గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు



ఏకైక విక్రయ ప్రతినిధులు మైసూర్ సేల్స్ ఇంటర్‌నేషనల్ లిమిటెడ్ బెంగుళూరు - బొంబాయి - న్యూఢిల్లీ - కలకత్తా - మద్రాసు - సికింద్రాబాదు.

MCA/MSIL/SS/1



''అమ్మ మనసు''లో చలం, కె. విజయ



''కృష్ణవేణి''లో ఒక సన్నివేశం

పోలికలో వున్నారు — అలాంటప్పుడు, ఆకారంలో మాత్రమే పోలిక వున్నదా లేక అలవాట్లలో, అభిప్రాయాల్లో గూడా పొత్తు వుందా అని తెలుసుకునేందుకు అనువుగా ఒకే వ్యక్తిని ద్విపాత్రాభినయానికి బుక్ చేయడం జరుగుతోంది.

ప్ర మీరు దర్శకత్వం వహిస్తున్న చిత్రం యొక్క కథ ఎలాంటిది ? అందులో వాణిశ్రీ పాత్ర ఏమిటి ?

జ : సమాజంలో ఆడ, మగ ఇద్దరూ సరి సమానులే. పుట్టడమే సమానత్వంతో పుట్టారు. ఒక ప్రదేశంలో మగవారి ఆధిక్యత అధికంగా వున్నందున, ఆడవారు అక్కడ అబలలు అనడం అసమంజసం; అలాగే ఒక ప్రదేశంలో ఆడదానిది పై చెయ్యి అయినందున, మగవాడు సబలుడు కాదు అనడానికి వీల్లేదు. ఆడ, మగ అన్ని విషయాల్లోను సరిసమానులే అని చాటిచెప్పే సాహసిక యువతి పాత్రనే వాణిశ్రీ ధరిస్తున్నది.

వీరికి దర్శకత్వం ఏమిటో తెల్సివున్నా, దర్శకుడిగా- ఒక చిత్రానికి నిర్దేశకత్వం వహించడం ప్రథమం కాబట్టి, తన అనుభవ సారాన్నంతటిని

# సినిమా

వుపయోగించి భేష్ అనిపించుకోవాలి అని ఆశిస్తున్నాను. కృష్ణ ద్విపాత్రాభినయం, వాణిశ్రీ నాయికత్వం, సారథి స్టుడియోస్‌లో షూటింగు నిర్వాహకం వీరు దర్శకత్వం వహిస్తున్న క్రొత్త చిత్రంలోని ప్రత్యేకతలు

## ఆనంద నిలయం

అదొక పెద్ద భవంతి. అందులో వసించే వ్యక్తులు ముగ్గురు. ఇంటి యజమాని రంగనాథ్. ఇల్లాలు ప్రభ. ఇంటిని కంటికి రెప్పలా రక్షించే సేవకుడు సత్యనారాయణ.

ముగ్గురున్న ఆ యింట్లోకి మరొక జీవి ప్రవేశించింది బోసినవ్వుల పాపాయి పుట్టి ఆ యింటిని ఆనంద నిలయం చేసింది.

పాపాయిని చూచి ప్రభ పరవశించింది. రంగనాథ్ మురిసిపోయాడు. సత్యనారాయణ చంక లెగరేశాడు ఇట్టి సంతోష సమయాన్ని యినుమడింపచేసే చందాన మల్లెమాల ఒక మధురమైన పాటను రాశారు.

''మల్లి విరిసింది, పరిమళపు
జల్లు కురిసింది, ఎన్నో
ఏండ్లకు మా యింట, పండినది
యీ నోముల పంట'' — ఈ పాటను

సుశీల, బాల సుబ్రమణ్యం చేత సత్యం పాడించారు. ప్రభకు సుశీల, సత్యనారాయణకు బాలు గొంతు నిచ్చారు.

ఈ ఆనందమయ ఘట్టం కౌముదీ పిక్చర్స్ వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం ''రామయ తండ్రి''లో కనిపిస్తుంది. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. స్టుడియో ప్రమేయం లేని చిత్రం యిది.

ముఖ్య పాత్రలను జయంతి, రమాప్రభ, రాజబాబు, అల్లు రామలింగయ్య, నిర్మల, రమణారెడ్డి, అపర్ణ, మమత పోషిస్తున్నారు. ఈ చిత్రానికి మాటలను, పాటలను నిర్మాత మల్లెమాల సుందర రామిరెడ్డి వ్రాశారు.

## పిచ్చోడి పెళ్లి

మురళీ కృష్ణా ఎంటర్ ప్రైసెస్ నిర్మించే చిత్రం పేరు యిది. ఈ కథను పినిసెట్టి వ్రాశారు. మాటలను కూడా ఆయనే రచించారు. కె. ఎస్. ఆర్. పిక్చర్స్ అధినేత కె. ఎస్. రెడ్డి యీ చిత్రానికి దర్శకుడు. కథానాయకుడి పాత్రను రాజబాబు పోషిస్తున్నాడు. అక్టోబరు నుండి షూటింగు ఆరంభం.

## రామ్‌గా బాలకృష్ణ రహీమ్‌గా హరికృష్ణ

రాజలక్ష్మి కంబైన్స్ నిర్మిస్తున్న చిత్రంలో రామ్‌గా బాలకృష్ణ, రహీమ్‌గా హరికృష్ణ నటించ, బి. ఏ. సుబ్బారావు దర్శకత్వంలో షావుకారు జానకి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నిర్మల, చంద్రమోహన్, రోజారమణి ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. ఈ చిత్రానికి రుక్మాంగదరావు నిర్మాత.



''దొరబాబు''లో ఒక దృశ్యం

## సునందిని పెండ్లికూతురైంది

"జగమే మాయ" సుందరి సునందిని పెండ్లి కూతురైంది ఆ శుభ సందర్భాన్ని పురస్కరించుకుని "గూడుపుఠాణి" నాయిక శుభ ఒక పాట పాడింది

"ఓయమ్మో బంగారుబొమ్మా,
ముద్దులగొమ్మా
నీ రొట్టె విరిగి నేతిలో పడ్డదమ్మా"

అంటూ పెండ్లికూతురిని ముస్తాబుచేస్తూ మురిపించింది సునందిని సిగ్గుతో తల వంచింది "కట్" అన్నారు దర్శకుడు పి చంద్రశేఖరరెడ్డి ఈ దృశ్యం శ్రీ వాణీ ఆర్ట్స్ కంబైన్స్ వారి "పుట్టింటి గౌరవం" చిత్రంలో కనిపిస్తుంది కొసరాజు పాటను వ్రాయ, సత్యం సంగీతాన్ని సమకూర్చ, సుశీల పాడింది

ఇంతకీ సునందినికి భర్తగా వచ్చినది ఎవరకో అంటారుగా హాస్యనటుడు పద్మనాభమే "పుట్టింటి గౌరవం" కథను నిర్మాత సుబ్బరాజు వ్రాశారు ఇందులో పద్మనాభానికి తోటి అల్లుళ్ళుగా అల్లు రామలింగయ్య, సాక్షిరంగారావు నటిస్తున్నారు ఈ చిత్రానికి మోదుకూరి జాన్సన్ మాటల రచయిత

పుట్టింటి పరువును, మెట్టినింటి మర్యాదను కాపాడడంలో ఎదుర్కొన్న యిబ్బందులు, ఇక్కట్లు ఎన్ని వున్నా రెండిండ్లకు గౌరవాన్ని తెచ్చిపెట్టిన గుణవంతురాలిగా శుభ నటిస్తున్నది చెల్లెల్ని ప్రాణప్రదంగా ప్రేమించిన అన్నయ్యగా కృష్ణంరాజు నటిస్తున్నారు కృష్ణంరాజుకు జవరాలుగా భారతి, శుభకు భర్తగా గీత ప్రసాద్ నటిస్తున్నారు ఆడించే అత్తయ్యగా సూర్యకాంతం అగుపిస్తుంది

## రాజబాబు కథకు దాసరి దర్శకత్వం

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు నవ్వుల వర్షాన్ని కురిపించడంలో దిట్ట అయినట్టే, కరుణ రస ప్రధానమైన కథలను వ్రాయడంలో కూడా ఎక్స్‌పెర్ట్ అన్న నిజాన్ని "ఎవరికి వారే యమునా తీరే" కథ విన్నప్పుడు తెలిసివచ్చింది. ఈ కథకు దాసరి నారాయణరావు దర్శకుడు. ఈ కథను చిత్రంగా నిర్మించే వ్యక్తి దిడ్డి కుమార్. చిత్ర నిర్వాహకుడు దిడ్డి శ్రీహరిరావు.

ఈ చిత్రం షూటింగు యిటీవల ప్రారంభమైంది. ఈ ప్రపంచంలో ఎవర్ని నమ్మాలో, ఎవర్ని కూడదో అనేడి సమస్యపై అల్లబడిన కథ యిది. దీనికి నారాయణరావు మాటలను, చక్రవర్తి సంగీతాన్ని సమకూర్చారు.

"ఎవరికి వారే యమునాతీరే" కథకు రాజబాబు నాయకుడు. నాయిక రోజారమణి ముఖ్య పాత్రలను సత్యనారాయణ — దేవిక; ప్రభాకరరెడ్డి — కృష్ణకుమారి; రమాప్రభ, అల్లురామలింగయ్య, మాడా, చిట్టిబాబు, శ్రీరాజ్ పోషిస్తున్నారు.

ఇందులో రోజాకు లభించిన పాత్ర కష్టమైనది. ఈ పాత్రను ప్రతిభావంతంగా పోషించిందో, రోజాను పట్టుకోవడం కష్టమవుతుంది. మమతలకు నిలయమై, మమకారానికి ఆలయమై నిలిసిల్లే గుడ్డిపిల్ల పాత్ర రోజా ధరిస్తున్నది. ప్రేమకు బానిసయై, అనురాగానికి ప్రతిరూపమై నిలిచే పాత్ర రాజబాబు చేపట్టినది

రాజబాబు పాత్ర ఎలాంటిదంటే — ఇతరులను నవ్విస్తాడు తను ఏడుస్తాడు ఇతరులను ఏడిపించడానికి తను నవ్వుతాడు త్యాగధనుడి వేషం రాజబాబుది

## కృష్ణుడిగా రాజబాబు

లక్ష్మీ చిత్ర నిర్మిస్తున్న "సత్యానికి సంకెళ్ళు" చిత్రంలో హాస్యనటుడు రాజబాబు కృష్ణుడి వేషం కట్టాడు అయిదువేళ్ల వేదాంతాన్ని ప్రచారంచేసే సత్యనారాయణకు కనువిప్పు కలిగించడానికి రాజబాబు కృష్ణావతారం దాలుస్తాడు ఈ చిత్రానికి కె ఎస్ ప్రకాశరావు కథకుడు + దర్శకుడు ఈ చిత్రాన్ని రామకృష్ణరావు, ఏకాంబరం నిర్మిస్తున్నారు కృష్ణ, వాణిశ్రీ ముఖ్య తారాగణం.

చేసిన ఫీట్సు చూసినప్పుడు ఒళ్లు గగుర్పాటు చెందింది క్లయిమాక్స్ దృశ్య చిత్రీకరణకుమాత్రం మూడు లక్షలు ఖర్చయినట్టు తెలిసింది తెలుగులో కాస్ట్లీ చిత్రాలను నిర్మించే ఘనత జగపతి సంస్థకే దక్కే విధంగా "మంచి మనుషులు" బుజావు చేస్తుంది

ఈ చిత్రంలో శోభన్, మంజుల, జగ్గయ్య, నాగభూషణం, రాజబాబు, మాష్టర్ చింటు ముఖ్య పాత్రధారులు చిరంజీవి సత్యానంద్ యీ చిత్రానికి మాటలను వ్రాశాడు

## పిచ్చి పుల్లయ్య

శ్రీ రమణ చిత్ర ఈస్ట్‌మన్ కలర్‌లో తలపెట్టిన చిత్రం "పిచ్చి పుల్లయ్య" నవరసభరితమయిన కథను గొనియున్నది ఆద్యంతం నవ్వుల వర్షం కురిపించే గమ్మత్తయిన పిచ్చి పుల్లయ్య పాత్రను చలం పోషిస్తున్నారు.

"బంగారు కలలు"లో ఒక దృశ్యం



## క్లయిమాక్స్‌కి మూడు లక్షలు

జగపతి పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "మంచి మనుషులు" రషస్ చూడడం జరిగింది. ఇటీవల కాశ్మీరు, సిమ్లాలలో జరిగిన షూటింగు దృశ్యాలను, క్లయిమాక్స్ దృశ్యాన్ని వీక్షించడం జరిగింది.

పాటలను గూర్చి వ్రాయాలంటే, మొదట వెంకటరత్నం ఛాయాగ్రహణ చాతుర్యాన్ని పేర్కొనాలి. ఆయన కెమెరా పరుగెట్టింది. తరువాత మహదేవన్ సంగీతాన్ని ప్రశంసించాలి. ఫోక్ ట్యూన్ చెయ్యడంలో తన ప్రత్యేకతను ప్రదర్శించారు. తరువాత ఆచార్య ఆత్రేయ కవితా ప్రాభవాన్ని ముచ్చటించాలి. పాటలను చిత్రీకరించడంలో దర్శకుడు రాజేంద్రప్రసాద్ అసాధ్యుడు అని చెప్పితీరాలి.

పతాక సన్నివేశం చూసినప్పుడు ఒళ్లు జలదరించింది. కాలే మంటలలో మోటార్ సైకిల్పు

ఈ చిత్రం తాలుకు షూటింగు కోనసీమలో జరపడానికి నిశ్చయించినట్టు చలం చెప్పారు. గ్రామీణ వాతావరణం ప్రతిబింబించే కథా వస్తువును గొన్న "పిచ్చి పుల్లయ్య" శ్రీ రమణ చిత్రకు వున్న పేరును ఎక్కువ చెయ్యగాక.

## 'డూ... డూ... బసవన్న' ఎప్పుడు?

రెండు వారాల క్రితం 'డూ... డూ... బసవన్న' చిత్రం త్వరలో ప్రారంభ మవుతుందని అన్నారే దానిని మానుకున్నారా అని ప్రశ్నించాను.

పిచ్చి పుల్లయ్య అయిన వెంటనే ప్రారంభం అవుతుంది. ట్రీట్‌మెంటు యింకా సిద్ధం గాకపోవడం వల్ల, షూటింగు వాయిదా పడింది అన్నారు, చలం.

—శ్రీనివాస్

'భేష్ ! నవతరానికి ప్రతినిధిని అనిపించు కున్నావు ! డాక్టరుగా మనుష్యులకే కాదు, నీ యీ పనితో, సమాజానికి కూడా చికిత్స చేస్తున్నావు ! అవును రవీ ! యిదివరకల్లా, యీ సమాజం కాస్త దారి తప్పిన ఆడదాన్ని, ఛీదరించుకుని, వెలివేసేది ! ప్రసాద్ లాటి సహృదయులుంటే, సరోజ లాటి ఆడ పిల్లల జీవితాలు ఆ విధంగా అధ్వాన్నంగా, అవవు ! వెళ్ళు ! వెళ్లి సరోజకి యిది మన అందరి మాటగా చెప్పి, ఏమంటుందో కనుక్కుని రా !' అన్నారు.

'కనుక్కు రావటమా ? చెప్పి ఒప్పించి తీసుకు వస్తాను !' రవి ఆనందంగా, వుత్సాహంగా అక్కడ నుంచి వెళ్లాడు.

'సరోజా ! సరోజా !' రవి పిలుస్తూ గదిలోకి వచ్చాడు.

అక్కడ ఉమ క్రింద కార్పెట్‌మీద కూర్చుని బొమ్మలతో ఆడుకుంటోంది !

రవి ఉమని చూడగానే, 'ఉమా ! ఆంటీ ఏది ?' అని అడిగాడు.

'ఊరు వెళ్లిందిగా డాడీ ! లేదు.' అంది ఉమ

'ఊరా ! ఏవూరమ్మా ? ఎప్పుడు ?' అతను ఖంగారుగా అడిగాడు.

'ఏమో ! నాకు చెప్పలేదు డాడీ ! నేను పెద్దయిన తర్వాత నీతో కలిసి తనదగ్గరకి రావాలిట! ఆ వూరు చాలా దూరంట ! ఇదుగో ! ఈ వుత్తరం నీకు యిమ్మని యిచ్చింది డాడీ !' ఉమ బొమ్మల మధ్య పెట్టిన వుత్తరం తీసి రవికి అందించింది !

'ఉత్తరమా !' రవి పాలిపోయిన ముఖంతో ఆతురతగా ఆ వుత్తరం చదువుకున్నాడు.

అందులో యిలా వుంది !

రవీ !

నీతో చెప్పకుండా వెళ్లిపోతున్నందుకు నన్ను మన్నించు ! నేను బాగా ఆలోచించే ఈ పని చేస్తున్నాను ! నీ క్షేమం, ఉమ భవిష్యత్తు కోరే యిలా వెళుతున్నాను ! రవీ ! మీరందరూ మంచి వాళ్ళుగా, మీ హృదయంలో స్థానం యిచ్చారు ! మీ యింట్లో మీతోపాటు వుండమంటున్నారు ! కానీ నాకే ముఖం చెల్లటంలేదు ! పాప పెరిగి పెద్దయితే ఏం చెప్పను రవీ ! ఒక తాగుబోతు కూతురివి అని చెప్పనా ? లేక వివాహం కాకుండానే నాకు పుట్టిన బిడ్డ అని చెప్పకోనా ? అట్లా చెప్పకుంటే నేను నీతిలేనిదాన్ని అని, శీలం లేని దాన్ని అని పాప అనుకోదా రవీ ! పాప ఎదురుగా వుంటూ, దానిమీద కన్నతల్లి మమకారం చూపించకుండా వుండగలిగే నిగ్రహం, పాషాణత్వం నాకు లేవు ! నేనిలా వెళ్లిపోవటంలో పాప భవిష్యత్తే కాదు ! నీ మంచికూడా వుంది అని ఎందు కంటున్నానంటే, తప్పు చేయకపోయినా, శీలం కోల్పోకపోయినా, ఈ సంఘం నన్ను పతిత అంది ! అంటోంది ! నా జీవితాంతం అంటూనే వుంటుంది! నేను మీమధ్య వుంటే, నా గత చరిత్ర ఏదో విధంగా బైటకి రాకమానదు ! నలుగురూ మిమ్మల్ని తలోరకంగా సూటిపోటీగా అనక మానరు! గతంలో జరిగినదే మళ్లీ చర్విత చరణం కావచ్చు !



## బంగారు కలలు

(23వ పేజీ తరువాయి)

అందుకే — మీ అందరికీ — దూరంగా — సుదూరంగా — వెళ్లిపోతున్నాను రవీ ! ఒకనాడు నాకెవరూ లేరని కుమిలి కుమిలి ఏడ్చాను ! ఈనాడు యింతమంది ఆత్మీయులున్నారు నాకు ! ఆ సంతృప్తితోనే, ఆ ఆనందంతోనే, ఆ బలిమితోనే వెళ్లిపోగలుగుతున్నాను ! ఉమని నీకు అప్పగించాను ! ఉమని దగ్గరకుతీయటం జ్యోతికికూడా ఇష్టమైతే మీ బిడ్డగా పెంచి పెద్దచేయండి ! లేదంటే — ఉమని ఏ అనాధ ఆశ్రమానికైనా యిచ్చెయ్యి ! ఉమ ఎక్కడువున్నా దాని భవిష్యత్తు నీ కర్తవ్యంగా నువ్వు భావిస్తావని నాకు తెలుసు ! దానికి ఏ లోటూ రానివ్వవనే నమ్మకం నాకుంది ! అందుకే నిశ్చింతగా వెళ్లిపోతున్నాను ! నిన్ను బాధ పెడితే నన్ను క్షమించు ! నన్ను దీవించు రవీ ! నేను ఎక్కడున్నా నిశ్చింతగా వుండాలని, మనస్ఫూర్తిగా దీవించు ! నాగురించి నువ్వు ఏ దిగులూ పడకు !

---

ఒక పెద్ద తార ఒక పెద్ద హీరోతో యిక కలిసి నటించనంది.

"నీతో ఇకమీద నటించక్కర్లేదు ! ఎంత హాయి..." అంది హీరోతో ఆవిడ.

"అసలు నటించింది ఎప్పుడు ?" అని హీ. అడిగాడు తా. ని.

---

నేను యిప్పుడు నర్సును ! అది నాకు తిండికీ బట్టకీ లోటులేకుండా గడుపుతుంది. ఇన్నేళ్లనుంచీ, కష్టాలతో, కన్నీళ్లతో, ఎగుడుదిగుళ్లతో, భారంగా గడిచిన ఈ జీవితంలో ప్రతిరోజూ, ప్రతి క్షణం, నాలో సున్నితత్వాన్ని, అమాయకత్వాన్ని హరింపచేసినాయి ! నన్ను శిలలా మార్చినాయి ! యింతకంటే కష్టాలు నాకేం వస్తాయి ? ఇప్పుడు నాకే కోర్కెలూ లేవు ! ఈ శరీరంమీద నాకేం వ్యామోహం లేదు ! అలాగని నేను విరక్తితో ఆత్మ హత్య చేసుకోబోవటంలేదు. ఎందుకో తెలుసా ? నర్సుగా, నా యీ చేతులు, ఈ ప్రపంచంలో కొంతమంది పీడిత హృదయాలకి వుపశమనం కలగ చేస్తాయి ! శాంతిని చేకూరుస్తాయి ! వాళ్లకోసం నేను బ్రతుకుతాను ! నా యీ శేష జీవితం నర్సుగా గడుపుతాను !

మనం మళ్లీ కలుసుకుంటాం అనే నమ్మకం నాకుంది ! ఒకవేళ, ఏ పరిస్థితుల కారణం చేతయినా, యిదే మన ఆఖరి కలియిక అయితే — రవీ ! మరు జన్మ అనేది నాకుంటే, ఆ జన్మలో, నువ్వు తప్ప కుండా, నా తోబుట్టువుగా నాకు లభించాలని ప్రతి దినం దేవుణ్ణి ప్రార్థిస్తాను !

సెలవ్.

సరోజ.

'డాడీ ! డాడీ ! ఎందు కేడుస్తున్నావు ?' ఉమ రవి భుజంపట్టి కదుపుతూ అంది.

రవి ఉలిక్కిపడ్డాడు. కళ్లు తుడుచుకుని ఉమని ఎత్తుకున్నాడు.

'ఆంటీ ఎక్కడికి వెళ్లింది డాడీ ?'

'వూరు వెళ్లిందమ్మా !'

'మనం ఎప్పుడు అక్కడికి వెళదాం ? ఆంటీ మనల్ని రమ్మందిగా !'

'వెళదాం తల్లీ ! తప్పకుండా వెళదాం ! యిప్పుడుకాదు ! నువ్వు బాగా చదువుకుని, ప్రతి క్లాసూ ఫస్ట్‌న పాసయి, పెద్దగా అయిన తర్వాత !'

ఇంతలో జ్యోతి, ప్రసాద్, వేణు, రాధ, రాజారావుగారు అందరూ అక్కడికి వచ్చారు.

'సరోజని అడిగావా రవీ!' రాజారావుగారు అడిగారు.

'సరోజ లేదు. వెళ్లిపోయింది.' రవి చేతిలో వుత్తరం జ్యోతికి అందించాడు.

'వెళ్లిపోయిందా ?' జ్యోతి ఆశ్చర్యంగా అని, ఆ వుత్తరం గబగబా చదివింది.

'ఇదుగో ప్రసాద్.' జ్యోతి వుత్తరం ప్రసాద్‌కి అందించింది.

'ఈ ఆంటీ ఎవరు ?' జ్యోతిని చూస్తూ అంది ఉమ

'ఆంటీ కాదమ్మా ! మమ్మీని ! నీ మమ్మీని నేను !' జ్యోతి చేతులు చాచింది.

ఉమ ఉరికినట్టుగా వచ్చింది.

'అవునమ్మా ! నీకు అమ్మని ! ఏది ? అమ్మా అని పిలు ' ఉమని ముద్దుపెట్టుకుంటూ అంది.

'అమ్మా !' ఉమ ఆనందంగా జ్యోతి మెడ చుట్టూ చేతులు పెనవేసింది

రవి వాళ్లిద్దరినీ చూస్తూ అలాగే నిలబడ్డాడు !

అతని కళ్లు మెల్లగా చెమర్చినాయి !

* * *

సూర్యుడు అస్తమిస్తున్నాడు !

సాయంత్రం అయిపోతోంది !

కెంజాయ రంగులో ప్రపంచం అంతా బహు సుందరంగా వుంది !

దూర ప్రయాణం నుంచి తిరిగి వచ్చిన పక్షి సంపులు, చెట్లమీద గూళ్లలో చేరి కువకువ లాడుతూ సాయంత్రపు సంగీతంలా శబ్దం చేస్తున్నాయి ! ఏళ్ల తరబడి, యజమానులని నమ్ముకుని కష్ట సుఖాలు వారితోనే భరిస్తూ, బ్రతుకు తున్నట్టుగా వున్న, పశువుల మందలు యిళ్లకి చేరుకుంటున్నాయి !

సరోజ పెట్టె పట్టుకుని నడుస్తోంది ! సుందరమైన ఆ ముఖంలో నిర్లిప్తత, నిర్మలత్వం నిండుగా కనిపిస్తున్నాయి ! అందమైన ఆ కను దోయిలో నిశ్చలత, దృఢ మనస్తత్వం ప్రతిబింబిస్తున్నాయి !

దూరంగా — సుదూరంగా — నింగి నేలని తాకుతోందా అని భ్రమగా అనిపిస్తున్నచోట, నారింజ రంగులో, సూర్యుని అంతిమ కిరణాలు సహస్రంగా భూమి మీదకి వాలి వున్నాయి ! వింత వెలుగుతో మెరిసిపోతూ, వున్నవాటిని చూస్తుంటే, ఈ జీవితంలో విసిగిపోయిన వారికి, శాంతిని చేకూర్చే, దివ్య సౌధానికి, దారి చూపే రాచబాటల్లా, విస్తృత పరుచుకుని వున్నట్టుగా వున్నాయి !

పెట్టె పట్టుకుని నడుస్తున్న, సరోజ అందమైన తనూలత ఆ దివ్య కిరణాల వైపు నడుస్తున్నట్టుగా, క్రమంగా దూరమై, ఆ నారింజ రంగులో చుక్కలా కలిసిపోయింది !

*[అయిపోయింది]*

# సలహాలు!

డా. కె. వెంకటేశ్వరరావు

**కె. యు. — పార్వతీపురం.**

నా వయస్సు 28 సం. లు ఎక్కువగా ఆలోచించినప్పుడు ఎడమవైపు ఛాతి భాగమంతయూ చెమట పట్టి చల్లగా అయిపోతుంది గుండె ఆగిపోతుందేమో అన్నట్లుగా వుంటుంది

ఎక్స్—రే 'ఇ. సి. జి' పరీక్షలు చేయించుకోవటం చాలా అవసరం ప్రతిరోజూ కొంచెందూరం నడుస్తూ వుండాలి. ఆహారంలో క్రొవ్వు పదార్థాలు తీసుకోవటం మాని వెయ్యాలి వుప్పు, కారం కూడా తగ్గించాలి. ఒకసారి, బ్లడ్ ప్రెషర్, మూత్ర పరీక్ష చేయించుకొంటే మంచిది.

**ఎస్. కె. — ఆత్మకూరు.**

నా వయస్సు— 16 సం లు వున్నట్లుండి నాలుక పిడచ కట్టడం, కళ్లు తిరగటం, శరీరమంతా చెమటపట్టి, స్పృహ లేకుండా పడిపోతాను

దీనిని 'పాస్చ్యురల్ హైపో టెన్షన్' అంటారు. నెత్తురు లేమి వల్ల ఇలా జరుగుతుంది నెత్తురు తగ్గటానికి కారణాలు వెతకాలి. మల పరీక్ష, నెత్తురు పరీక్ష చేయించుకోవటం ముఖ్యం

'కాప్సవిట్' మాత్రలు— రోజుకి ఒకటిచొప్పున రెండు నెలలు వరుసగా వాడండి ఆకు కూరలు పళ్లు తీసుకోవటం ముఖ్యం,

**కె. ఎ. ఆర్. — తాడేపల్లి గూడెం.**

నాకు 3 నెలల క్రితం కూర్చున్నప్పుడు ఆసన ద్వారం దగ్గర పోటు వచ్చేది డాక్టరు ఆసనద్వారం ప్రక్కన కురుపు ఉందని ఆపరేషన్ చేశారు కాని ఆ రంధ్రము ఇప్పటికీ పూడ లేదు చీము వస్తున్నది

'పెరి ఏనల్ ఏబ్సెస్' లనే కురుపులు ఆసన ద్వారం ప్రక్క వచ్చి సరిగా చికిత్స చేయనప్పుడు అది ఆసన గొట్టం లోపలి భాగంలో కూడా ఎగలటం వల్ల, ఆసన గొట్టమునకు ఆసన ద్వారపు ప్రక్క భాగమునకు మధ్య చిన్న కాలువలాగా ఏర్పడుతుంది దీనిని "ఫిస్టులా ఇన్ ఏనో" అంటారు దీనిని మంచి శస్త్ర చికిత్స ద్వారా తప్పక నయం చేయవచ్చును.

**[illegible] — విజయవాడ.**

[illegible] పుట్టుకతోనే వీపు వెనుక భాగంలో 'మెనింగోసిల్' అనే గడ్డ వుండేది 8 నెల వయస్సులో గుంటూరులో ఆపరేషన్ చేశారు దాని తర్వాత ఇప్పుడు రెండు కాళ్లూ కదల్చలేక పోతున్నది. స్పర్శ కూడా లేదు..



వెన్నెముక నిర్మాణంలో లోపం పుట్టుకలోనే పుట్టుకతో సామాన్యంగా 'స్పైనా బైఫిడా' అనే రోగం వస్తుంది. అంటే వెన్నెముక మధ్యలో ఖాళీ ఏర్పడడం, ఈ ఖాళీ ద్వారా వెన్నుపాము, దాని నుంచి వచ్చే నరాలు బయటికి చొచ్చుకుని వస్తాయి. ముఖ్యంగా కాళ్లకి పోయే నరాలు ఇందులో చిక్కుకోవడం వల్ల కాళ్లు కదల్చకపోవటం, స్పర్శ లేకపోవటం సహజం అంతేగాని ఆపరేషన్ చేసినందు వల్ల ఏర్పడివుండదు. తిరిగి న్యూరో సర్జన్లను చూడండి

**ఎస్. ఆర్. ఎస్. కాకినాడ.**

యూరిన్‌లో పస్ సెల్స్ ఉన్నాయి మందులు 'టెర్రామైసిన్' వాడినా ఫలితం లేదు ఇంకా వివాహం కాలేదు

మూత్రంలో 'పస్' సెల్సు చీము ఉండటం, మూత్రపిండములు, దాని గొట్టములు ( యూరిటర్స్ ) మూత్రాశయము బ్లాడర్, లేక మూత్రము బయటికి పోయే గొట్టము 'యూరెత్రా'లలో సూక్ష్మ క్రిముల ద్వారా వాపు ఏర్పడినప్పుడు రావటం జరుగుతుంది

పస్ సెల్స్ ఉన్నప్పుడు మూత్రమును 'కల్చర్' చేసి రోగ కారకములైన క్రిములను కనుగొని వాటికి తగిన యాంటీబయాటిక్‌లు వాడాలి తోచినట్లుగా మందులు వాడితే ఫలితం ఉండదు.

**పి. వి పి. నిడుబ్రోలు.**

నా భార్యకు తరచూ దగ్గు వస్తూ ఉంటుంది గొంతు నెప్పికూడా ఉంటుంది మందులు వాడితే తాత్కాలికంగా తగ్గుతున్నది. ఎక్స్‌రేలో లోపం లేద న్నారు

దగ్గు రావటం అనేక కారణాలవల్ల జరుగుతుంది అయినా క్రానిక్ బ్రాంకైటిస్, ఇస్నో ఫీలియా, బ్రాంకియేక్టేసిస్, క్రానిక్ న్యూమోనైటిస్‌లనే వ్యాధులవల్ల ఇలా రావటం సహజం

వాతావరణంలోని మార్పులు, దుమ్ము, కడుపులో క్రిములు ఈ రోగాలకి ముఖ్య కారణాలు. వీటికి తగిన పరీక్షలు చేయించడం అవసరం

పైన చెప్పిన రోగాలను ఎక్స్‌రే ద్వారా కనిపెట్టడం కష్టం

రోగాన్ని బట్టి వైద్య నిర్ణయం చెయ్యాలి ఒక లక్షణం మాత్రం తీసుకుని వైద్యం చెప్పటం కష్టం

**జి. ఆర్. — మద్రాసు.**

నా వయస్సు—34 సం లు కొన్ని రోజులుగా మూత్రం పసుపుగా పోతున్నది. ఉత్సాహంలేదు. ముఖము రక్తహీనంగా కనబడుతున్నది.

మూత్ర పరీక్ష చేసుకుంటే కామెర్లు అవునా కాదా అని తెలుస్తుంది. 'జాండిస్' అని తేలినప్పుడు ఆహారంలో నూనె వస్తువులను చేర్చక పోవటం, ఎక్కువ షుగర్, గ్లూకోజు తీసుకోవటం ముఖ్యం.

విటమిన్ సి—250 మిల్లీగ్రాముల మిల్లికార్టెన్— రోజుకి 1 చొప్పున 15 రోజులు ఆరియోమైసిన్ మాత్రలు రోజుకి 2 చొప్పున 10 రోజులు ఎక్కువగా పళ్లరసం తీసుకోవాలి.

*** చిన్నారి చిలిపి చేష్టలు ***

పసిపిల్లల ఆలోచనాశక్తి ఎటువంటిది ? బహుశా కన్న తల్లిదండ్రుల వూహాశక్తికి కూడా అందనటువంటిది అనిపిస్తుంది.

మా సునందకు పదహారు నెలల వయసు. మాటలు రాలేదు కానీ, అన్నీ అవగాహన చేసుకుంటుంది.

ఎందుకో ఒక రోజున, నాకూ, మా శ్రీవారికి కూడ ఒక చిలిపి ఆలోచన కలిగింది. మాటల సందర్భంలో "పాపకు నువ్వంటే ఇష్టమో, నేనంటే ఇష్టమో తేల్చుకుందాం" అన్నారు మావారు. ఎంతైనా తల్లిని కదా; పాప నా పక్షమే గనక, అందుకు 'సై' అన్నాను.

పాపను, గది మధ్యలో నిలబెట్టాము. ఆయన ఒకమూలన నేను మరొక మూలన కూర్చొని "మా తల్లివి కదూ...మా చిట్టివి కదూ ! ఇలా రామ్మా !" అంటూ ఇద్దరం చేతులు చాపాము.

పాప,వాళ్లనాన్న వేపుఒకసారి,నావేపు ఒకసారి నవ్వుతూ చూసింది. అటు వాళ్ల నాన్నగారి వేపుకుగాని, ఇటు నావేపుకుగాని రాలేదు అది తన చిన్నారి మనసులో 'అమ్మ . నాన్న'ల ప్రేమను తూచి వుండాలి

తర్వాత ఏమనుకున్నదో ఏమో, వాళ్ల నాన్నగారి వేపుకి ఒకచెయ్యి, నావేపుకి ఒక చెయ్యి బారజాపి గది మధ్యలో కదలక మెదలక అలాగే ఉండి పోయింది మేం చకితులమయినాము

—శ్రీమతి బి. కోమలాదేవి, బెరిలి

సీరియల్




6

(గత సంచిక తరువాయి)

"వెళ్ళొస్తానమ్మా!" అంటూ వచ్చేసే ముందు, తల్లికి చెప్పినప్పుడు మాత్రం, ఆవిడ ముఖంలో గూడుకట్టుకున్న నైరాశ్యం, కళ్ళలోని దిగులు, కంటి కొలకుల్లో నిలిచిన కన్నీటి బిందువులూ చూసేసరికి, మధు హృదయం, చలించింది.

ఆ వయస్సులో, వాళ్ళని అన్యాయంగా బాధిస్తున్నానేమో అనుకునేసరికి, కొద్దిగా ఏ మూలో పశ్చాత్తాపం లాంటిదే కల్గింది.

"అక్కడికెళ్ళాక, వీలు చూసుకుని ఉత్తరం వ్రాస్తాలే అమ్మా!– పెళ్ళిగురించి నా నిశ్చయం తెలుపుతూ" అన్నాడు తలొంచుకుని.

పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది; ఆవిడకి.

"మామయ్యగారి సీతకు మాత్రం, మరో సంబంధం చూసేసుకోమని చెప్పేయండి. నాకోసం ఎదురు చూడొద్దు."

"పోనీలే. సీత కాకపోతే, మరోపిల్ల. వాడికి నచ్చిన వాళ్ళనే చేసుకుంటాడు. బొత్తిగా అటువైపు పిల్లనే చేసుకుని, పూర్తిగా అక్కడి మనిషి అయిపోకుండా ఉంటే చాలు."

అదే ఏనుగెక్కినంత ఉత్సాహం యిచ్చిందావిడకి. ఇంత ముఖం చేసుకుని, "అవును బాబూ! మన ఆచారాలూ, పద్ధతులూ వేరు. అవునన్నా, కాదన్నా ఎవరి సంప్రదాయాలు వాళ్ళవే. ఏటికెదురీదితే, నెగ్గుకు రావడం కష్టం. ఈ వయస్సులో, మా మనస్సులు కష్టపెట్టకు." అంటూ కళ్ళు తుడుచుకుంది.

కొడుకెళ్ళిపోయాక, భర్తతో, "చూశారా?– వాడు నా కొడుకండీ నా కొడుకు! నా మాటెప్పుడూ కాదనడు. ఏ దుష్టశక్తుల ప్రభావమో ఈ నాలుగు రోజులూ వాడినలా ప్రవర్తించేలా. చేసిందిగాని, వాడెప్పుడూ మనమాట కెదురు చెప్పడండీ" అంది; కొడుకు మాటలతో పూర్తిగా కరిగిపోయిన శేషమ్మగారు.

*     *     *

మధు ఊర్నించి వచ్చేశాడు గాని, ఎక్కడా సుషమ దర్శనం కాలేదు ఎవరో బంధువులింట్లో పెళ్ళికి వెళ్ళిందట మధు ఉత్సాహమంతా, పొంగుతోన్న పాలమీద నీళ్ళు చిలకరించినట్టుగా, అణగారిపోయింది.

సూర్యకిరణాలు, కిటికీలోంచి సూటిగా వచ్చి, మంచంమీద పడేసరికి మెలుకువ వచ్చింది. కాని లేవబుద్ధిగాక, అలాగే ఉండిపోయాడు

ఎప్పుడొచ్చాడో నౌకరు కుర్రాడు, చడీ చప్పుడూ కాకుండావచ్చి, కర్టెన్లు దించి, గదంతా చీకటిచేసి మరీ వెళ్ళిపోయాడు

ఇంక లేచిపోదామనుకుంటూనే, మగత (దలో కలలు కంటున్నాడు మధు

"ఇంత ఎండెక్కిపోయింది ఇంకా (దేనా?" అంటూ, మూసిఉన్న తలుపులు గెంటి, లోపల కొచ్చింది సుషమ

ఆ అమ్మాయి మాటలతో, సుషుప్తావస్థలో ఉన్న మధు, ఉలిక్కిపడి, కళ్ళు విప్పాడు.

"హలో! గుడ్‌మార్నింగ్! హౌఆర్‌యూ. ఇంకా నిద్ర పూర్తి కాలేదేమిటి?" అంది నవ్వుతూ దగ్గరకొచ్చి

"ఓ! సుషమాయా? వెరీ వెరీ ఫైన్ మార్నింగ్! కళ్ళు తెరిచేసరికి దేవతాదర్శనం. ఇంకేం? ఇవ్వేళ రోజంతా సుఖాలన్నమాటే" అంటూ బద్ధకాన్ని గెంటి, లేచి కూర్చున్నాడు

సుషమ గలగలా నవ్వుతూ, అక్కడున్న కుర్చీని, మంచం దగ్గరగా లాగి కూర్చుంది.

"గుడ్ చెప్పినట్లుగానే, అప్పుడే వచ్చేశారే?" అంది కళ్ళు తళ కులీనుతూంటే

..."మరి నువ్వు వచ్చేయమన్నావుగా వచ్చేశాను" అన్నాడు కొంటెగా.

"అంతా అబద్ధం అవన్నీ ఉత్తకబుర్లు. నాకోసమెందుకొస్తారుగానీ, అక్కడ బోరు కొట్టేసుండాలి అంతేగదూ?" అంది

"అదీ కొంత కరక్టే అనుకో నిజంగానే, నాకక్కడ ఏంతోచలేదు నువ్వు జ్ఞాపకం వచ్చావు వచ్చాశానంతే" అన్నాడు చెప్పాల్సింది అయిపోయినట్టుగా

"సరే చూసి వెళ్దామనొచ్చా ఇంక వెళ్తాను మీరు తయారుకండి" అంటూ లేచి నిలబడింది

"ఒద్దొద్దు నువ్వూ కూర్చో ఇద్దరం కలిసి టీ తీసుకు చాలా రోజులయింది" అంటూ మధు లేచి, బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు.

టీ సరంజామా అంతా, ట్రేలో పెట్టి తీసుకొచ్చి, సుషమా ముందున్న టీపాయిమీద పెట్టాడు పనివాడు

సుషమ టీ కలపడం మొదలుపెట్టింది.

మధు, టవల్‌తో ముఖం తుడుచుకుంటూ వచ్చి, ఎదురుగా వున్న సోఫాలో కూర్చున్నాడు.

సుషమా అందించిన కప్పు తీసుకుంటూ "ఊం ఇక్కడి విశేషాలేమిటి? ఎలా వున్నారంతా?" అన్నాడు.

> *జరిగినకథ:* మధు ఢిల్లీలో ఒక పెద్ద ఉద్యోగి దక్షిణాది వారన్నా వారి పిండివంటలన్నా ఇష్టమున్న సుషమ అతనితో చనువుగా ఉంటుంది. మధుకి ప్రక్కింటి మిసెస్. సింగ్ కుటుంబంతో పరిచయం వృద్ధి చెందుతుంది. తండ్రి దశరథ రామయ్య నుంచి ఉత్తరం రావటంతో ఇంటికి వెళుతున్న మధును కంజీవరం చీరె, ఆవకాయ తెమ్మంటుంది సుషమ. కృత్రిమ నాగరికతకు అలవాటుపడ్డ మధుకి స్వగ్రామంలోని ప్రశాంత వాతావరణం నచ్చదు. ఎవరిని వివాహమాడుదామా అని సుషమ – సీతలను బేరీజు వేసుకున్న మధు, సీతను వివాహం చేసుకోవటానికి ఇష్టపడడు. శలవలున్నా తిరిగి ఢిల్లీ వెళ్ళిపోటానికి బయల్దేరతాడు మధు.

"ఇక్కడి విశేషాలేముంటాయి? అన్నీ తిరిగొచ్చారు. మీరే చెప్పాలి ఆ విశేషాలన్నీ" అంది సుషమ, టీ సిప్ చేస్తూ.

చాలారోజులకి మళ్లీ అలా కూర్చుని, టీ తీసుకుంటూంటే మధుకి యిప్పుడెంతో హాయిగా ఫ్రీగా, సుఖంగా గాలి పీల్చుకున్నట్టుంది.

చక్కటి యింట్లో, నౌకరు అందిస్తూంటే, అందమైన అమ్మాయి ప్రక్కన కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, ఖరీదైన కప్పుల్లో టీ త్రాగడానికీ, స్వంత ఊర్లో తల్లి అందించిన కాఫీ గ్లాసుకీ వ్యత్యాసం అనుభవిస్తున్నాడు

నిజమే. ఒక వయస్సొచ్చాక ఎవరి యిల్లు వారిది పుట్టిపెరిగిన వాతావరణమైనా, యింకోచోట ఇమడటం కష్టం అనుకున్నాడు

"ఏమిటి? పుష్పకన్యలా తయారయావ్?" అన్నాడు సుషమని పరిశీలనగా చూస్తూ.

ఆ అమ్మాయి సిగ్గుపడింది.

అలా అరుణిమ దాల్చిన ముఖంతో, తెల్లటి బట్టల్లో వున్న సుషమ మనోహరంగా కనిపించింది మధుకి

ఆ చెవినుంచీ, ఈ చెవినుంచీ విరిసిన మల్లెపూలు ఒకోటి అందంగా వ్రేళ్లాడుతున్నాయి ఏ కర్ణాభరణాలూ యివ్వలేని అందాన్ని సుషమ కిస్తున్నాయవి పరిమళాలు వెదజల్లే మల్లెలమాల కంఠాన్ని అవరించుకుంది

జడలో, చెవి వెనుకగా, చంపకు, రెండాకులతో వున్న మల్లెపూవు అందంగా తురిమింది చెవి ప్రక్క నుంచి అవి యువతలికి తొంగిచూస్తూ, సుషమ శరీర కాంతితో పోటీపడుతున్నాయి

"అంత యిదిగా, నావైపు చూడ్డానికేముందిగాని, యింతకూ మీరు తెచ్చినవి చూపించేదుందా? లేదా?" అంటూ దెబ్బలాటకొచ్చింది

మధు నవ్వుతూ, లేచివెళ్లి పెట్టె తీశాడు. సుషమ కోరినవన్నీ, ఒకోటీ తీసి అందించాడు

"ఇవన్నీ నువ్వు కావాలన్నవైతే, ఇవేమో నేను యివ్వదల్చుకున్నవి" అంటూ ఇంటి దగ్గర్నుంచి తెచ్చిన మిఠాయిలు తీసి, ఆమెకిచ్చాడు

"అన్నీ నాకే యిచ్చేస్తున్నారు. మరి మీకో?" అంది సుషమ నారిస్తూ

"ఇవన్నీ నీకనే తెచ్చా. తీని తినీ నాకు ముఖం మొత్తింది" అన్నాడు

ఇంత ముఖం చేసుకుని, కృతజ్ఞతలు తెలిపి అన్నీ తీసుకుని వెళ్లిపోయింది

ఆ సాయంత్రం సుషమ తండ్రి వచ్చి, చీరకు డబ్బిచ్చేయబోయాడుగాని, మధు తీసుకోలేదు. ఆ అమ్మాయి సంతోషం



ముందు, ఆ చీరకు విలువకట్టి పుచ్చుకోవడం యిష్టంలేకపోయింది; మధుకి

ఆ సాయంత్రం, మిసెస్ సింగ్ చెప్పిన బ్లూ కంచి పట్టుచీర తీసుకుని, వారింటికెళ్లాడు

"ఇప్పుడే మీగురించి అంటున్నా — మిష్టర్ సింగ్‌తో. మీరు యిప్పుడెలాగా వస్తారని, నాకు తెలుసు నిన్న మీరు రావడం నేను చూశాను" అంటూ ముఖమంతా చిరునవ్వు పులుముకుని సాదరంగా ఆహ్వానించింది ఆవిడ

ఆ చీర ఆవిడకు మహా నచ్చింది "ఎంత మంచి టేస్టు కలరదీ ఎంత బాగుంది!" అంటూ తెగ మెచ్చుకుంది

"మీ సెలక్షన్, ఆడవాళ్ల సెలక్షన్ కంటే కూడ గొప్పగా వుంది రాబోయే వైఫెవరోగాని అదృష్టవంతురాలు!"

అంటూ అభినందన పూర్వకంగా, అతని భుజంమీద తట్టింది.

"ఎంతసేపూ నీ చీరగొడవేనా? మాకేమైనా కొంచెం టీ ఇచ్చేదుందా?" అన్నాడు సింగ్.

"నిజమే. చీరగొడవలో ఆధ్యాసే లేకపోయింది క్షణంలో తీసుకొస్తా" అంటూ లోపలికెళ్లింది.

అన్నట్టుగానే, చాలాత్వరలోనే, టీకి రమ్మని పిలుపొచ్చింది లోపల్నించి

మిస్టర్ సింగ్ వెంట, డైనింగు రూంలో కడుగుపెట్టిన మధుకి, అక్కడి దృశ్యం విభ్రాంతిని కలిగించింది అక్కడ మిసెస్ సింగ్ మధు తెచ్చిన చీరలో చక్కగా తయారై, టీ కలుపుతూ కనిపించింది టేబుల్ మీద, నాలుగైదు పళ్ళాలలో తినుబండారాలు పెట్టున్నాయి

"ఏమిటి? అప్పుడే విప్పేయడం కట్టేయడం కూడానా? మీరు చాలా ఏక్టివ్‌లా ఉన్నారే? - అబ్బ ఆడవాళ్లకు చీరలంటే ఎంత మోజు' అన్నాడు మధు ఆవిడను చూసి, విస్మయంగా.

"మరేమిటనుకున్నారూ? అందులోనూ, మా ఆవిడ యిలాంటి విషయాలలో చాలా చురుకు అన్నాడు సింగ్, నవ్వుతూ

"ఇంతకూ ఎలాఉంది?- మా ఆడవాళ్ల మీద విమర్శనా బాణాలు తర్వాత విసురుదు గానిర్లెండి ముందు బాగుందోలేదో చెప్పండి". అందావిడ.





# రెండు పువ్వులు

"బాగుండకపోవడమేమిటి ? మీ కాంప్లెక్షన్‌కి ఫస్టుగా సూటయింది." అప్రయత్నంగానే మనస్సులో ఉన్నమాట చటుక్కున పైకనేసి, తర్వాత, నాలిక్కర్చుకున్నాడు మధు—పొరపాటు మాట్లాడలేదుగదాని.

ఆవిడ నవ్వింది.

—ఆ నవ్వులో గర్వంఉంది

ధీమాఉంది

భాషకందని, మరేదో భావముంది.

"చీర బాగుంది; చీరలోఉన్న మనిషి, అంతకంటే బాగుంది. కాని ముందు డబ్బు తెచ్చి రావూసాబ్‌కియ్యి" మిస్టర్ సింగ్ జ్ఞాపకంచేశాడు.

"సరిగ్గా అదేనేనూ చెప్దామనుకుంటున్నా. ఇచ్చేయండి మీరు" అంది ఆవిడ

'నా దగ్గర పైసా లేదు చీర కావాలని చెప్పి తెప్పించుకున్నదానివి నువ్వు. మధ్య నన్నెందు కడుగుతావు ? నువ్వే యిచ్చుకో" అన్నాడాయన.

—"భలేవారే! నేనేం డబ్బుకి తీసుకొచ్చాననుకున్నారేమిటి ? నేనేదో, మీ మాటలు సరదాగా వింటూ ఉండిపోయానంతే... అది, మీకు నేనిచ్చే ప్రెజెంటేషన్ నేను డబ్బు పుచ్చుకోను ఛఛ. అసలలాంటి ఆలోచనే మనస్సులోకి రానివ్వొద్దు" అనేశాడు అప్రయత్నంగానే

మిస్టర్ అండ్ మిసెస్ సింగ్ లిద్దరూ, ఒక్కసారిగా నొచ్చుకోడం మొదలెట్టారు.

"మీకెంతో నచ్చింది ఆ తృప్తి చాలు నాకు. ఇంకేం యివ్వనక్కర్లేదు." అంటూ అక్కడ్నించి వచ్చేశాడు మధు

*　　*　　*

ఒకరోజు, మధు ఆఫీసుకెళ్లే ముందు, సుషమా వచ్చి, "సాయంత్రం పెదళాడే వస్తారా ?" అనడిగింది.

"ఏమిటి విశేషం ?" అన్నాడు మధు.

"పెద్ద విశేషమే. కార్లో లిఫ్ట్ యిస్తారేమోనని"

"ఎక్కడికేమిటి ?"

"కన్నాట్ ప్లేస్".

"సరే వస్తాలె ఛాట్ తింటానికేగదా ? లేటయినా మరేం ఫరవాలేదులే."

"అబ్బే. అందుక్కాదు. చిన్న పనుంది."

"ఏమిటో ఆ రాచకార్యం ?"

"అబ్బ కొంచెం లిఫ్టడిగినందుగ్గాను, లక్ష ఆరాలు తీస్తున్నారూ

అక్కడ — నాకు తెలిసిన టైలరొకడున్నాడు మీరు తెచ్చిన కంజీవరం చీరమీదికి బ్లౌజ్ కుట్టించాలి. మళ్లీ ఏడున్నరైతే మూసేస్తారుగదా ?"

"సరే తప్పతుందామరి. ఏమిటో ? ఊ తెగ తొందరపడి పోతున్నావు"

"అబ్బే, ఎంతాశ! అంత తేలిగ్గా చెప్పేస్తానేమిటి ? ఆరోజుదాకా సస్పెన్స్ ఈ లోపున ఊహించుకోవాల్సిందే"

"కొంపదీసి, మళ్లీ యింకో పుట్టినరోజు గాని చేసుకోవడంలేదుగదా ?—చావాలి చేతిలో డబ్బయినాలేదు—ప్రెజెంటేషన్ కొనడానికి"

"మీ ప్రెజెంటేషన్ల కోసం ఎవరూ ముఖంవాచి లేరిక్కడ. మిమ్మల్నంత బాధపడుతూ తెచ్చిమ్మని ఎవరూ ఏడవడంలేదు. అందుకే — ఆవేళ — ఆ చీరకి డబ్బిచ్చేయబోయాం — మీరే ఎంత చెప్పినా పుచ్చుకోలేదు "

రోషావేశంతో ఆ అమ్మాయి ముక్కుపుటాలు అదిరాయి ముఖం ఎర్రకందగడ్డలా అయింది

సంభాషణ యింకోదారి పట్టేసరికి,మధూ గాభరా పడ్డాడు

— ఆత్మాభిమానంతో, ఎర్రగా అగ్నిగోళంగా జ్వలిస్తోన్న ఆ అమ్మాయి ముఖం చూసి, "ఛఛ, ఉడుకుమోతు మనిషివి. ప్రతిదీ సీరియస్‌గా తీసుకుంటావు సరదాగా, స్పోర్టివ్‌గా తీసుకోవడం రాదానీకు?" అన్నాడు ఆప్యాయంగా మందలిస్తూ

"వహ్వా! మళ్లీ యిదొకటి. మీరైతే పాపం అనేయొచ్చుగాని, నేను జవాబు చెబితే మాత్రం ఉడుకుమోతునైపోతాను. కదూ ?" అంది కోపంగా.

"ఆఫీసుకెళ్లేముందు మూడ్ చెడగొట్టకమ్మాయ్ నవ్వుతూ సాగనంపు లేకపోతే, ఆనక దానికో గుద్దించేయగలను — అపరాధానికి క్షమార్పణ కోరుతున్నాగా పొరపాటైపోయింది బైదిబై సాయంత్రం పెందళాడే వచ్చేస్తాలే కావాలంటే పెనాలిటీగా పిక్చర్‌కి కూడ తీసుకెళ్తా. ప్రసన్నురాలివి కామరి—ఏదీ?

# చూడండి మామూలు పంపు నీటినుండి కల్మషములను ఫిల్టరుచేసి ప్యూరిటాన్ దానిని త్రాగుటకు ఎలా 100% సురక్షితము చేస్తుందో.

కలరా, టైఫాయిడ్, రక్తవిరేచనములు,
గాస్ట్రో-ఎంటెరైటిస్ మొదలైన నీటి ద్వారా సంక్రమించే
జబ్బులు రాకుండా ఇంతకంటె మరో మంచి హామీ లేదు.






ప్యూరిటాన్ తేలికైనది, పగులనిది. ఒక చోట నుండి మరొక చోటికి తీసుకు పోవటానికి అనుకూలమైనది. శుభ్రపరచుటకు వీలైనది.



నేడే ఒక ప్యూరిటాన్ తీసుకోండి మీకు ఆప్తులైన వారి కోసం వాడదగినది.

ఉచిత చిన్న పుస్తకానికి ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి.

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెని (ప్రై) లి
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001

CHAITRA BLS 19 TEL

పోయిందా కోపం ? నవ్వు మరి'' అంటూ నవ్వించాడు.

''మీరెప్పుడూ యింతే. క్షణం ఒకలా మాట్లాడ్తారు క్షణం యింకోలా మాట్లాడ్తారు—సరే; వెళ్లండి. ఈ సారికి క్షమించి విడిచిపెడ్తున్నా. మళ్లీ ఎప్పుడైనా యిలా మాట్లాడేరో...?''

''చెవులెక్కదీస్తారు'' అంటూ జవాబిచ్చాడు, బుద్ధిమంతుడిలా మదు – రెండు చెవులూ పట్టుకుని.

''సరే. వెళ్లండి. సాయంత్రం నేను తయారై ఉంటా.''

''ఓ. కె.'' అంటూ టాటా చెప్పి, మధు కారు స్టార్టు చేశాడు.

ఆ సాయంత్రం, మధొచ్చేసరికి, సుషమ అతనికోసం ఎదురుచూస్తూ రెడీగా ఉంది.

కాఫీ తీసుకుని, సుషమ డైరెక్ట్ చేసిన స్థలానికి తీసుకొచ్చాడు మధు.

సుషమ, బ్లౌజ్ పీస్‌తీసి, టైలర్ కిచ్చింది – ''ఎల్లుండి ఇచ్చేటట్టయితేనే యిస్తాను. లేకపోతే యివ్వను. చాలా అర్జంటు. మళ్లీ అదీ ఇదీ సంజాయిషీ చెప్తే ఊరుకునేది లేదుసుమా'' టైలర్‌తో, సుషమ డబాయించి మాట్లాడ్తూంటే, ఆ ప్రక్కనే షోకేసులో పెట్టున్న బట్టలు పరిశీలిస్తున్నాడు మధు.

''జాకిట్టు మటుకు ఫస్టుగా కుదరాలి. ఫిట్టింగ్ బాగోపోతే ఊరుకోను.''

''కుదరకపోవడం మాదగ్గర ఉండదు లెండి. ఇదివరకు ఎన్నిసార్లు కుట్టియిచ్చా. ఏమైనా తేడా వచ్చిందా ?'' గుడ్డ అటూ యిటూ తిరగేసి చూస్తూ, టైలర్ సమాధానం చెప్తున్నాడు.

''అందుకేగదా ?– మళ్లీ వెతుక్కుంటూ యిక్కడికే వచ్చింది ... ఊఁ. కొలతలు తీసుకోండి.''

ఆ అమ్మాయి మాటలువిని, ఉలిక్కిపడి యిటు తిరిగాడు మధు.

పమిటతీసి, చేత్తో పట్టుకుని, శరీరాన్ని నిర్భయంగా, అతని కప్పగించి, మిష నతని ముందు ఠీవిగా నిలబడుంది సుషమ.

అతను టేపుతో చెస్టు, నడుము అన్నిటి కొలతలూ తీసుకుంటున్నాడు వరుసగా.

సరిగ్గా తీసుకుంటున్నట్టేగదా ? తేడా వస్తే ఊరుకునేదిలేదు. కావాలంటే మరో సారి తీసుకోండి.''

# రెండు పువ్వులు

పట్టిపట్టి మరీ కొలుస్తోన్న దర్జీవాడ్ని మరోసారి హెచ్చరించింది సుషమ.

అతని చేతులు శరీరావయవాలకు తగులుతోన్నా, ఆ అమ్మాయిలో ఏ సంచలనం కనిపించడంలేదు. కదులూ మెదులూ లేకుండా నిలబడి మరీ మాట్లాడుతోంది. ముఖంలో సిగ్గుగాని, ఎవరైనా చూస్తున్నారేమోనన్న సంకోచంగాని, మచ్చుకైనా కనిపించడంలేదు; ఆ అమ్మాయిలో.

మదు ఆశ్చర్యపోయాడు. ఆ అమ్మాయి వైఖరి ఏమనుకోడానికీ ఏం అర్థం కాలేదు.

ఇంట్లో ఉన్నప్పుడుకూడ, సుషమ అతని దగ్గర అలాగే ప్రవర్తించేది ఒకోసారి.

సోఫావెనుకే మధు బుక్ షెల్ఫ్ ఉంటుంది. అతను సోఫాలో కూర్చుని, ఏ పుస్తకమో చదువుకుంటూంటే, సుషమ వచ్చి, వెనుక




నుంచి వంగి చూస్తూ, ''ఏమిటి చదువుతున్నారూ?''అనడిగేది. ఒకోసారి అతని మీదుగా వంగి, షెల్ఫ్ లోంచి పుస్తకాలు తీసుకునేది. అలా వాలడంలో ఆ అమ్మాయి ఎత్తైన వక్షోజాలు ఎన్నోసార్లు వీపుకితగిలేవి

స్త్రీ స్పర్శ ఎరుగని మదుకి, ఒళ్లు గగుర్పొడిచేది. ''అబ్బ. కొంచెం దూరం; మీద పడకు''అనేవాడు, ఆ అమ్మాయికి తగలకుండా కొంచెం క్రిందకు వంగుతూ.

ముందు తెల్లబోయినా, తర్వాత అర్థమవగానే, నవ్వేసి''యూ; సిల్లీ'' అంటూనవ్వుతూ పుస్తకం తీసుకుని వచ్చి కూర్చునేది. ''ఇంకా చిన్నతనం'' అనుకుని సరిపెట్టుకునేవాడు మధు.

''పోనీ తనైతే వేరు. పరాయివాడితో కూడానా?'' అనుకున్నాడు బాధగా.

శరీరాన్ని అప్పగించి, కొలతలు తీయించుకుంటోన్న సుషమైతే బాగానే ఉంది. కాని మధ్య మధుమాత్రం ఏదో అపరాధం చేసిన వాడిలా, అటువైపు చూడలేక పోతున్నాడు. అలా అని చూడకుండానూ ఉండలేక పోతున్నాడు.

''అయిపోయింది. ఇంక వెళ్దామా?'' అంటూ దగ్గరకొచ్చి అడుగుతోన్న సుషమ వైపు సూటిగా చూడలేక, ముఖం దించుకుని బయటకు నడిచాడు.

షో కేసుల్లోంచి కనిపిస్తోన్న బట్టలు, రకరకాల వస్తువులు చూస్తూ, ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు.

''ఏమిటి–మౌనంగా ఉన్నారు? గోల్ గుప్పాతిందామా? హాట్‌హాట్‌గా వేస్తున్నాడు'' అంటూ మాట్లాడించింది సుషమ.

''సరే పద''అంటూ అటువైపునడిచాడు.

తెల్లగా గుండ్రంగా పొంగిఉన్న గోల్ గుప్పాలతో, చింతపండు పులుసునింపి, మసాలావేసి, సుషమాకి అందించాడు, దుకాణంవాడు మధు, ఆలూ ఛాప్స్ తీసుకున్నాడు

సుషమాకి తిండంటే మహా ఆపేక్ష. ఎప్పుడు బయటకొచ్చినా, కావాలని కోరి, మరీ తింటూంది.

ఒక్క సుషమన్న మాటేం ? ఢిల్లీలో చాలామంది, బాగా ఏదువు సంస్కారం ఉన్న వాళ్లుకూడ, కారాపివచ్చి, రోడ్డు ప్రక్క పెట్టున్న దుకాణాల్లో, నిలబడి తింటూంటారు

వాళ్లు అలా నిలబడి తింటూంటే, ''ఓ! ఇక్కడున్నావా నువ్వు?'' అంటూ దగ్గరగావచ్చి స్కూటరాపాడో అబ్బాయి.

–తెల్లగా, పొడుగ్గా బలిష్ఠంగా ఉన్నాడు. కళ్లల్లో చలాకీతనం చిందు లేస్తోంది. హిప్పీ క్రాపింగు. భుజాలవరకూ ఉన్న జుట్టు, ముఖంమీద పడుతోన్నప్పుడల్లా, అందంగా తల ఎగరవేస్తున్నాడు. పొడుగ్గా పెంచిన విక్కర్సు అతని ముఖానికి క్రొత్త అందాన్నే ఇస్తున్నాయి. నున్నగా గీసిన గడ్డమంతా ఆకుపచ్చటి రంగు లీనుతూ అందంగా కనిపిస్తోంది.

ఆ యువకుడ్ని చూడగానే, సుషమ కళ్లు ఆనందంతో మెరిశాయి. ముఖంలోకి క్రొత్త కాంతి వచ్చింది.

'' ఓ ! నువ్వా ? '' అంటూ దగ్గరగా వెళ్లింది.

''ఇక్కడిదాకావచ్చి కూడా, మా యింటికి

రాలేదన్నమాట". ముందు నడు. నిన్ను తీసుకెళ్లకుండా, వదిలేశానంటే, "ఎందుకు విడిచిపెట్టావ్, లాక్కుతీసుకు రాకుండా అంటూ మృదులా నన్ను చంపేస్తుంది" అన్నాడు ఆ అబ్బాయి.

"చిన్నపనిమీద వచ్చాను. ఇప్పుడుకాదు, మరోసారి తప్పక వస్తాగా — అన్నట్టు మీ అన్నయ్యగారి బేబి బాగుందా? బాబును కాన్వెంట్లో చేర్పించినట్లున్నారు గదూ? — అమ్మగారి హెల్త్ ఎలాఉంటోంది? — మృదులా రాలేదేం? ఇంట్లో ఏంజేస్తోందేమిటిప్పుడు?" అంటూ పరిసరాలు మర్చిపోయి అతనితో మాట్లాడేస్తోన్న సుషమ, చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినట్టయి, ఒక్కసారిగా వెనక్కు తిరిగింది.

"సారీ. మిమ్మల్నిద్దర్నీ ఒకరికొకర్ని పరిచయమే చెయ్యలేదు" అంటూ.

"ఈయన మిస్టర్ రావ్—మా యింట్లో ఉంటున్నారు" అని అతనికి చెప్పి, మీట్ మిస్టర్ సునీల్‌కుమార్ — మా స్విమ్మింగ్ క్లబ్బులో యితనూ ఒక మెంబరు" అంటూ మధుకి పరిచయం చేసింది.

"ఓ! గ్లాడ్ టూ సీయూ" అంటూ మధు చేయి అందుకుని చేతులు కలిపి గట్టిగా ఊపాడు సునీల్.

అంతవరకూ నఖశిఖ పర్యంతం ఆ అబ్బాయినే పరిశీలిస్తూ ఉన్న మధు, ముఖాన్ని రాని నవ్వు అతికించుకుని, అతనికి షేక్ హేండిచ్చాడు.

టైలర్‌దగ్గర సంఘటనకే, షాక్ తగిలినట్టున్న మధుకి ఇది మరో పెద్ద షాక్. "అయితే సుషమాకి బోయ్‌ఫ్రెండ్స్ కూడ ఉన్నారన్నమాట" అనుకున్నాడు. అతని ముఖం నల్లగా మాడిపోయినట్టయిపోయింది.

"ఇంక నేనే కారణాలూ వినదల్చుకోలేదు. బజారు పనుంటే మళ్ళీ వద్దుగానిలే. నువ్వడిగిన ప్రశ్నలన్నిటికీ జవాబులిచ్చే ఓపిక నాకేం లేదు. ముందు ఇంటికినడు — అక్కడే అన్నీ తెలుసుకుందువుగాని" అంటూ చనువుగా భుజంమీద తట్టి, "ఛలో!" అంటూ రెక్కపట్టుకు స్కూటరు దగ్గరకు లాగాడా అబ్బాయి.

"మీరు వెళ్లిపొండి, రావూసాబ్. నేను తర్వాత వస్తా. ఈ సునీల్ పట్టుకున్నాడంటే యింక వదలడు" అంటూ, అతని వెనకే స్కూటరెక్కింది సుషమ.

ఆ అమ్మాయి చెయ్యూపడం, స్కూటర్ స్టార్టవడం ఒక్కసారే జరిగాయి.

కనుమరుగయేదాకా వాళ్లను చూస్తూనే ఉన్నాడు మధు.

స్కూటరువెనక, అతని వీపుకు ఆనుకు కూర్చుని, ఒకచెయ్యి భుజంమీద వేసి, నిర్వికారంగా వెళ్లిపోతోన్న సుషమను చూస్తూంటే, అతనికి ఎక్కడలేని కోపం వచ్చింది.

ఎలా, కారు డ్రైవ్‌చేసి యింటికి చేరుకున్నాడో అతనికే తెలీదు.

సుషమొస్తే మాట్లాడకూడదనీ, బతిమాలించుకోవాలనీ, తను చేసిన పొరపాటుకు క్షమార్పణ చెప్పించుకోవాలనీ అనుకుంటూనే, చాలాసేపుదాకా, నిద్రపోకుండా, అస్థిమితంగా గడిపేశాడు.

"సుషమ యింటికి వచ్చిందో? లేదో? ఇంకా ఆ జులపాల వెధవకూడా తిరుగుతూనే ఉందో?— ఎంత ఒద్దనుకున్నా అతని చెవులు, సుషమ వచ్చిన అలికిడికోసం ఎదురు చూస్తూనే ఉన్నాయి.

అవతలి గదిలో ఫోను ట్రింగ్‌మంది, చటుక్కున లేచి కూర్చున్నాడు మధు.

"ఈ వర్షంలో ఏ మూలో చిక్కుకుని, సుషమ ఫోను చేయడం లేదుగదా!" ఏదో తెలియని తృప్తి మనస్సంతా ఆక్రమించుకుంది.

"రాంగ్ నంబరేమో? ఇప్పుడు వెళ్లి ఎత్తడం ఎందుకులే" అనుకున్న మనిషే, బద్ధకాన్ని నెట్టి, లేచి వెళ్లి రిసీవరెత్తాడు.

అవతలనుంచి సన్నని కంఠం, "హలో!" అంది.

"హలో!— మధూ దిస్ సైడ్—యస్! మధూ స్పీకింగ్"

"నమస్తే. గుర్తుపట్టలేదా? నేనూ— మిసెస్. సింగ్‌ని మాట్లాడుతున్నా"

అవతలినుంచి ఆవిడ కంఠం వినిపించేసరికి మధులో ఉన్న ఉత్సాహం ఠక్కున దిగిపోయింది. ఎరక్క ఎత్తానే అనుకుంటూ, "చంపుతుంది గాబోలు. ఇప్పుడిదో బోరు" అనుకుంటూ "ఆఁ ఆ. నమస్తే" అంటూ బదులు చెప్పాడు నీరుకారిపోతూ.

"ఏం చేస్తున్నారేమిటి?"

"చస్తూ ఉంటే వెధవ కుశల ప్రశ్నలూ యీవిడానూ" అనుకుని విసుక్కుంటూ, పైకిమాత్రం, "ఏం చేయడంలేదు...ఏమిటి? యింత రాత్రి చేస్తున్నారు. అందరూ కులాసాయేనా?" అనడిగాడు

[ఇంకా వుంది]

## చిన్నారి చిలిపిచేష్టలు

- ★ మూడేళ్లనుంచి ఏడెనిమిదేండ్ల వయసు వరకు పాపాయిలంతా చాలా ముద్దుగా వుంటారు. వారి చిలిపిచేష్టలు, చిత్రమయిన తెలివి తేటలు కొన్ని మరుపురాని సంఘటనలకు, సన్నివేశాలకు దారి తీస్తూంటాయి... అటువంటి చిన్న సంఘటనలను, తేట తెనుగు మాటలలో కూర్చి మహిళలు మాత్రం వ్రాసి పంపినట్లయితే ఆంధ్ర సచిత్ర వార పత్రికలో పైన పేర్కొన్న శీర్షిక క్రింద బాగున్నవి వేయటానికి ప్రయత్నిస్తాము.
- ★ ఇది పోటీ కాకపోయినా, 'నిబంధన' లంటూ కొన్ని పుంచదలచాము. అవి యివి: 1. రచనలు తేట తెనుగులో కుప్తంగా వుండాలి కనుక వనితామణులు తమ 'రచన'లను ఇన్‌లాండ్ కవరుపై మాత్రమే విడివిడి అక్షరాలలో స్పష్టంగా వ్రాయాలి. 2. రచన వాస్తవిక చిత్రణ అయి వుండాలి 'కలంపేర్లు' వాడరాదు. 3. ప్రతి రచన క్రింద తెనుగులో— 'వ్రాసినవారి పూర్తిపేరు' చిరునామా ఉండితీరాలి. 4. ఎటువంటి పరిస్థితులలోను వీటిని త్రిప్పి పంపటంకాని, వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు గాని తావులేదు. ఇన్‌లాండ్ కవరుపై శీర్షిక పేరు స్పష్టంగా వ్రాసి, వాటిని సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ—3. అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.
- ★ ప్రచురణ అయిన ప్రతి 'చిన్నారి చిలిపి చేష్ట'కు రు 10 లు పారితోషికంగా యిస్తాము

—సం.

# కప్పలు

పిశుపాటి
ఉమామహేశ్వరమ్

(గత సంచిక తరువాయి)

ఆ పట్టు పట్టున జడుపు జ్వరం వచ్చి నాల్రోజులపాటు మంచంమీద నుండి లేవలేకపోయింది రాధమ్మ.

ఆ నాల్రోజులూ నిద్రాహారాల్లేకుండా పక్కనే ఉండి పరిచర్యల్జేసేడు రామ్మూర్తి. ఆమెకి రెండో రోజు కొద్ది తెలివి వచ్చి మన లోకంలో పడగానే మొదటిసారిగా, మనఃపూర్వకంగా ఆమెను ఆమె పేరుతోనే పిలుస్తూ "నన్ను క్షమించు రాధా! ఇంకెప్పుడూ యిటువంటి మాటలు సరసాలాడను. నన్ను క్షమించు' అన్నాడు.

ఆ తర్వాత అతనెప్పుడూ ఆమె ముందు కప్పల విషయం ఎత్తలేదు. కనీసం జువాలజీ పుస్తకం కూడా తెరవలేదు.

టేబిల్మీది పొటోలోని రాధ మొహంలోకి చూస్తుంటే జరిగిన సంఘటనలన్నీ మనసులో తిరిగేయి రామ్మూర్తికి.

కప్పని చూసినప్పుడల్లా అతనికి రాధ గుర్తొస్తుంది.

ఇవేళ మరీను.

కారణం ఆమె పుట్టింటో ఉండడం.

మనసు నిండా ఆమె రూపే నిండింది.

శరీరంలోని ప్రతి అణువూ ఆమె సాన్నిధ్యాన్ని కోరసాగింది.

మెదడు నిండా ఆమెను గురించిన ఆలోచనలే. తామిద్దరూ కలిసి యుగాల్ని క్షణాలుగా గడిపిన జ్ఞాపకాలే.

విరహం కలిగిస్తున్న తీయని బాధకతడు తట్టుకోలేక కుర్చీలో యిబ్బందిగా కదిలేడు.

రాధ కావాలి అంటోంది అణువణువూను.

మరు నిముషంలో అతనికి అమ్మమీదా, మామగారి మీదా, ఆచార వ్యవహారాల మీదా బోల్డు కోపం వచ్చేసింది.

రెండు నెలల క్రితం పెళ్ళి అయ్యి, కాపురం పెట్టిన కొత్త జంటను ఒంటరిగా బతకనీక మధ్య ఈవిడెందుకు. ఆ వుండేదేదో మొదట్నించీ ఉండక యిన్నాళ్ళు నించీ అన్నయ్య దగ్గర ఉన్నది వారం క్రితమే ఎందుకు రావాలి?

ఆవిడ వచ్చిన నాలుగు రోజులకే ఏదో ఆషాఢ మాసం గూడా వచ్చిందిట.

ఆషాఢమాసంలో, అత్తలూ, అల్లుళ్ళూ,కోడళ్ళూ ఒకరి కంట ఒకరు పడకూడదూ అవటూ అన్జెప్పి ఆ రూల్స్ ఎన్డ్ రెగ్యులేషన్స్ వో అరగంటసేపు వివరించి మొన్ననే వాళ్ళ నాన్నగారు చేతిలో రెండొందలు పెట్టి బట్టలు కుట్టించుకోమ్మా బాబ్జీ నెల కాంగానే పంపిస్తాగా అమ్మాయినీ అంటూ రాధన్తీస్కెళ్ళి పోయేడు.

పోనీ రాధెళ్లిపోయేక ఈవిడేనా యిక్కడుండ గలిగిందా లంటే అదీ లేదు. మొన్న రాధవెళ్లి పోగానే నిన్ననిటు పెద్దన్నయ్యొచ్చి 'లక్ష్మి పెద్దమనిషైందేవ్ అమ్మా' అన్చెప్పి అమ్మని తీస్కెళ్ళి పోయేడు.

ఆ లక్ష్మేనా వో మూడ్రోజులు ముందు బయట జేరివుండి వుంటే తనిద్దరికీ చెడి చెయ్యి కాల్చుకోవాల్సిన గతి తప్పేది కదా!

వేయేల! అంతా విధి ఘటన అనుకుంటూ కూర్చున్నాడు రామ్మూర్తి.

అతనికి నిద్ర రావడం లేదు.

చాలా చికాగ్గా వుంది మనసు.

రాత్రి ఒంటి గంట దాటింది.

చుట్టు ప్రక్కల యిళ్లలో అందరూ ఆదమరచి నిద్రబోతున్నారు.

ఒక్క రామ్మూర్తి యింట్లోనే లైటు వెలుగుతోంది.

బయట సన్నగా చినుకులు పడ్తున్నాయి.

ఇంటి ముందు ఖాళీ స్థలంలో నిలిచిన వర్షంనీటిలో జేరిన కప్పలు టీచర్లేని క్లాసులోని విద్యార్థుల్లా ఒహాఫే రణగొణధ్వని చేస్తున్నాయి.

ఆడ కప్ప లవసరం కలిగినప్పుడు మొగ కప్పలలా అరుస్తాయిట. తన మనసు పెడ్తున్న గోలకీ, ఆ గోలకీ ఆట్టే తేడా కన్పించలేదతనికి.

అర్ధాంగిని గూర్చి ఆలోచనల్తో అతనికి నిద్ర రావడం లేదు.

మర్నాడు మళ్లీ స్కూలుకెళ్లాలి, నిద్ర లేకపోతే కష్టం అన్జెప్పి చివరికి లైటార్ జేసి పక్కమీదికి జేరేడు గానీ, లాబ్ ప్యూన్ 'వేంకప్ప'ని అలా పిలవలేక వెంకయ్యా అని పిల్చే ఆమె బేలతనమూ, నూతిలో నీళ్ళు తోడితే కప్పలొస్తాయన్న భయంతో తనచేత తోడించే పిరికితనమూ, ఈ విషయాల్లో తప్ప మిగతా విషయాల్లోని ఆమె చురుకుతనమూ, పెంకెదనమూ, కళ్ళ ముందు నాట్యమాడసాగేయి.

అలాగే పక్కమీద దొర్లుతూండగా ఎప్పుడో తెలవారతూండగా పట్టిన కలత నిద్దట్లో గూడా అతనికి కప్పలమీదే కలలొచ్చేయి.

అతని మనస్సే మానస సరోవరంగా మారింది. అటువేపు తనూ, రాదా విహారానికెళ్ళి, ప్రణయ గీతాలు పాడుకుంటూంటే ఆ సరోవరంలోని కప్పలు బ్యాక్గ్రౌండ్ మ్యూజిక్ సప్లై చేసేయి. ఆ తర్వాత వాళ్ళిద్దరూ అందులో నౌకా విహారం జేస్తుంటే ఒక్కొక్క కప్పా చూస్తుండగానే మనిషంతెత్తెదిగిపోయి ఆమెనెత్తుకు పోడానికి ప్రయత్నిస్తే అతను వీరోచితంగా పోరాడేడు. ఒక్కొక్క కప్పనీ చంపేక ఆశ్చర్యం. . అవన్నీ కప్పలు కావు. . . రాధకి బోలెడంత మంది మేనత్త కొడుకులున్నారు. . వాళ్ళు తమ తమ నిజరూపాల్తో నేలరాలి పోయేరు.

ఈ విధమైన కలల్తో రాత్రి సగం సగం నిద్రబోడం మూలాన రామ్మూర్తి తెల్లారి లేచేసరికి తొమ్మిదైంది.

పదింటికల్లా స్కూలికెళ్ళి పోవాలన్న సంగతి గుర్తొచ్చేసరికి పాముచే తరమ బడ్తున్న కప్పలా చకచకా పరుగులెత్తుతూ పనికానిచ్చుగుని ఎంత ఆదరాబాదరాగా పరిగెట్టినా టైముకందుకోలేకబోయేడు.

అప్పటికే స్టాఫ్ ఎటెండెన్స్ రిజిస్టర్ హెడ్మాస్టర్ రూంలో కెళ్లిపోయింది.

అంచేత ఎంతో పొంచి పొంచి మీదికి దూకినా గానీ ఎర అందని కప్పలా ఆయన ముందు నిల్చోక తప్పలేదు. దానికి తోడు ఆయన ఎరని మింగబోయే కప్పలా చూడ్డం అతని కాళ్లలో మరింత ఒణుకు పుట్టించింది.

అసలే ఆయనింటి పేరు కప్పగంతులవారు. గోధుమరంగు గళ్ళ కోటేస్కుని చేతిలో బెత్తం పుచ్చుకుని ఆయన నడుస్తూంటే అచ్చు కప్ప గెంతుతూన్నట్టే ఉంటుంది.

దానికి తగ్గట్టు ఆయన చూపు, మాట తీరు గూడా అంతే.

కొంచెం మెల్లు, ఆ పైన చత్వారం కావటం మూలంగా మాటి మాటికీ కళ్ళజోడులోంచి పైకి చూస్తూ మాట్లాడతాడు.

ఇక మాట సంగతి సరేసరి. తొందర్తొందరగా



# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

**ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌ను పొందటము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!**

shilpi hpma 6A/73 TEL

మాట్టాడ్డం మూలాన మాట పూర్తి చేసేలోపల పదిహేను కప్పదాట్లు తప్పవు.

రామ్మూర్తిని చూస్తూనే ఆయనిలా అన్నాడు.

'య్యేమయ్యా. . . (రామ్మూర్తీ. . బడికిపుడా.. త్తెల్లారిందా. . . టైమెంతో. . !'

ఆయనది టెలిగ్రాఫిక్ భాష. సగంలో ఆపేస్తాడు. మాట్టాల్లోక.

మిగతాది ఎదుటి వాళ్ళు అర్థం చేసుకోవాలి.

ఆర్యాల చేస్తే మరింత రెచ్చి పోయే ఆయన స్వభావం తెల్సున్నవాడు గాబట్టి క్లుప్తంగా 'క్షమించండ్సార్. . అలీసెమై పోయింది. . వాటి దుంపతెగ... ఆ చామదుంప లో పట్టానేగి చావలేద్సార్ . . !' అన్నాడు తలొంచుకుని.

ఆయనకి 'చామదుంపలంటే యిష్టం.

అంతే! రామ్మూర్తి పాచిక బ్రహ్మాండంగా పారింది

'పూ. . స్సర్లే. . ప్పో. . ముందాక్లాసుకి. . . టాపు లేపేస్తున్నార్రు. . కోతి వెధవలు'

మరు క్షణంలో పాము నోటి నుండి తప్పించుగున్న కప్పలా బైటపడ్డాడు రామ్మూర్తి.

సూటిగా తన క్లాసువేపెళ్ళ బోతూంటే సైన్సు క్లాసులోంచి తెలుగు మాస్టారైన పట్టాభిరామయ్య గారి కంఠం వినిపించింది.

పాఠం మధ్యలో ఏదో ఉదాహరిస్తూ. . . కప్పలు పది వేలు జేరుగదరా సుమతీ! అంటూ పద్యం పూర్తి జేసేవేళకి రామ్మూర్తి తన క్లాసు ముందునించి పోతూంటే చూసి భావగర్భితంగా నవ్వేరాయన.

రామ్మూర్తికీ, కప్పలకీ ఉన్న సంబంధం, అనుబంధం ఆయనకు తెల్సును.

రామ్మూర్తి సిగ్గుపడి మరింత చురుగ్గా అడుగేస్తూ తన క్లాసులోకెళ్ళి పడ్డాడు.

నిజంగానే టాపు లేపేస్తున్నారు కుర్రాళ్ళు.

చెవులు బద్దలు చేసే ఆ గోల భరించలేకవెడ్తూనే 'సైలెన్స్' అంటూ గద్దించి అందరి నోళ్ళకి తాళం కప్ప బిగించేడు.

అటెండెన్స్ తీస్కోడం పూర్తయేక 'టుడేస్ లెసన్' అని ప్రారంభించగానే '. . . ఈజాన్ రీ ప్రొడక్టరీ సిస్టమాఫ్ ఫ్రాగ్ సర్' అంటూ పూర్తి జేశాడో వెనక బెంచీ విద్యార్థి.

అందరూ ఒక్కసారిగా ఘొల్లుమన్నారు.

రామ్మూర్తి హృదయంలో మళ్ళీ తుఫానురేగింది.

అసలే అర్ధాంగి దగ్గిరలేక, విరహ జ్వాలల్లోమాడిపోతూన్న తరుణంలో ఇటువంటి పాఠమా!

పాఠం చెప్పకపోతే కుర్రాళ్ళు మరింత కట్టుతప్పి పోతారన్న భయంతో మొత్తానికి ఎలాగైతేనేం మొదలెట్టేడు.

కానీ మనసులోనూ, అణువణువులోనూ రాధ ఆమె తాలూకు జ్ఞాపకాలూ నిండి వుండడంమూలాన చార్ట్‌లోని ఫ్రాగ్ రాధ మోహంలా కన్పించసాగింది.

నిగ్రహించుకోడం కష్టంగా ఉంది.

ఏదో చెప్తున్నాడు గానీ ఏం చెప్తున్నాడో తనకే తెలీట్లేదు.

కుర్రాళ్ళు తెగ నవ్వేస్తున్నారు.

జోకులేమన్నా పేలి పోతున్నాయా! ఏమో!

ఎందుకు నవ్వుతున్నారో కూడా తెలీట్లేదు.

# కప్పలు

చివరికో బుద్ధిమంతుడైన కుర్రాడు తెగించి లేచి 'మీరు కప్పల్నంగతొదిలేసి మనుష్యుల్నంగతిచెప్తున్నారు సార్' అని గుర్తుచేస్తున్నట్టుగా హెచ్చరించే వరకూ అతని వొళ్ళు తనకి తెలీలేదు.

అప్పటికర్ధమైంది రామ్మూర్తికి కుర్రాళ్ళలా ఎందుకు పేట్రేగిపోతున్నారో. ఆడపిల్లల మొహాల్లా (నాను ఎందుకంతకండగడ్డలుగా మారిపోతున్నాయో.

ఒక్క నిముషం తనని తాను నిగ్రహించుకుని 'ఇవేళ ప్రాణం బొత్తిగా బాగోలేదు. ఇవాపాఠం తీస్కోలేను. ఈ ప్రశ్నలకి సమాధానం రాయండి' అంటూ కొన్ని ప్రశ్నలు బోర్డుమీద రాసొచ్చి లేబ్‌లోపడ్డాడు.

వర్షపునీటితో నిండిన చెర్వోని కప్పల్లా అతని మనసులో రాధ తాలూకు ఆలోచన్లొకటే రొద పెడుతున్నాయి.

నూతిలోని కప్పలా అతని మనసు ఆమెతోడి ప్రపంచాన్ని గురించే తప్పమిగతా విషయాల్నిగురించి ఆలోచించట్లేదు.

చిరాగ్గా, అసహనంగా ఈజీ చైర్లో వెనక్కివాలి కళ్ళు మూసుగున్న రామ్మూర్తి.

'టిక్.... టిక్.... టిక్' మంటూ ఏదోశబ్దం వినబడేసరికి ఉలిక్కిపడి లేచాడు.

"ఈ ఇబ్బందులు, కష్టాలు ఇలాగే జరిగితే కొన్ని రోజుల తరువాత మనం ముస్టెత్తక తప్పదు." అన్నాడు (గుక్క తిప్పకోకుండా) ఆశావాది.

"ఎవరిని"? అని నిరాశావాది అడిగాడు.

వొకుర్రాడు బజార్లో దొరికే రేకు కప్పని నొక్కుతూ ఆడుకుంటూ పోతున్నాడు.

రామ్మూర్తి ఆ కుర్రాణ్ణి పిల్చేడు కిటికిలోంచి వాడు భయపడ్తూ వచ్చి ఎదురుగా నిలబడేడు.

'ఏవిటది.... చేతిలో' గద్దించేడు.

'ఏంలేద్సార్' అంటూ వెనక్కి నక్కాడుకుర్రాడు

రామ్మూర్తి ఆ కుర్రాడి చేతిలోంచి దాన్ని లాక్కొని 'క్లాసొదిలేసి యివ్వాపన్లు' అంటూ కసిరేడు.

పాపమాకుర్రాడు చేసేదేమీలేక మాస్టారి చేతుల్లో చిక్కుపడిపోయిన తనకప్పవంక దీనంగా చూస్తూ వెళ్ళిపోయేడు.

రామ్మూర్తి ఆ రేకు కప్పవంక ఆప్యాయంగా చూశేడు.

'దేవాంతకుడు' సినిమాలో కాబోలు ఎన్టీరామారావు తన ప్రియురాల్ని పిలవడం కోసం ఇటువంటి దాన్నే ఉపయోగిస్తాడు.

ఈ కప్పలు అంతమంచి పన్లగ్గూడా ఉపయోగిస్తాయన్నమాట.

రామ్మూర్తికి కోరిక ఎన్నాళ్ళినించో ఉంది మనసులో అటువంటిదోటి కొందామని, రాధమ్మ చెవిలో మొగిద్దామనీను.

కానీ యిన్నాళ్ళు తన పెద్ద తనమడ్డురాగా కొనడానికి చిన్నతనమేసి వూరుకున్నాడు.

వోసారి చుట్టూ కలయజూసి ఎవరూ లేరని నిర్ధారించుగున్నాక జేబులో చేయిపెట్టి నెమ్మదిగా సున్నితంగా ఆ కప్పని నొక్కసాగేడు.

'టిక్.... టిక్.... టిక్....' మంటూ అద్దేస్తూన్న ధ్వని అతని చెవులకెంతో ఆహ్లాదకరంగా వినిపించింది.

స్వయంగా రాధే తన చెవిలో గుసగుస లాడుతున్నట్టుగా భావించి తన్మయత్వంతో కళ్ళుమూసుగున్నాడు.

ఎవరో స్టూడెంట్‌వచ్చి తీసేవరకూ మళ్లీఅతడు కళ్ళు తెరవలేదు. '(ప్రాక్టికల్స్ తీసుగుంటారా సార్' అనడుగుతున్నాడు.

రామ్మూర్తి పూర్తిగా ఈ లోకంలోకి రావడానికి ఇష్టపడక సగం మత్తుతో, కళ్ళుగుడా సగమే తెరిచి 'వెంకప్పతో చెప్పు క్రాకోచ్‌లు సిద్ధం చేయమని. ఒస్తున్నా'నన్నాడు.

అతనుతెల్లబోయి' క్రాక్రోచ్ కాద్సార్....ఫ్రాగ్ డిసెక్షన్' అన్నాడు.

ఫ్రాగ్ అన్నమాట చెవిని పడగానే పూర్తిగా తెలివొచ్చేసింది రామ్మూర్తికి. ఆ తర్వాత ఆశ్చర్యం గూడా వేసింది.

ఏవిటి వింత నిన్నట్నించీను.

కప్పలు ! కప్పలు ! కప్పలు !

ఒహటే కప్పలు !

ఎటు చూసినా కప్పలే !

ఎక్కడ విన్నా కప్పలే !

పాటాల్లోను పలవరింతల్లోనూ గూడా కప్పలే !

ఎక్కడికి పోయినా, ఏం జేసినా, ఈ కప్పలు తనని వదలకుండా ముప్పుతిప్పలు పెడ్తున్నాయి.

ఆ పేరు వినగానే రాధ గుర్తొచ్చి ఆమెతాలూకు ఆలోచన్లు మూలివర్లిల్ని కరుచుగున్న కప్పల్లా తన్ని వదలట్లేదు.

నిజానికి తన పరిస్థితి ఏ మాత్రమూ బాగోలేదు. ఆమె తననుండి దూరమై రెండ్రోజులే ఐనా ఈ కప్పలమూలంగా రేగే ఆలోచన్లు గుండెల్లో రేగే విరహాగ్ని జ్వాలల్ని మరింత ఎగదోస్తున్నాయి.

కొత్త వయస్సు, కొత్త కోరికలు, క్రొంగొత్త అనుభవాలు ఇవన్నీ కలిసి కలవర పెడ్తూ నిగ్రహాన్ని అంతకంతకూ దిగజార్చేస్తున్నాయి.

అలా ఒంటరిగా కూర్చొని వూహల్లోనైనా కనీసం రాధతో కలిసి నందనవనాల్లో విహరిస్తూ ఉండి పోవాలనుంది.

కానీ తప్పదు.

వరుసగా అన్ని క్లాసులూ తీస్కోకుండా వదిలేస్తే బాగుండదు.

కప్పగంతుల వాళొచ్చి కథాకళీ ఆడతారు.

లేచి వెళ్ళేడు లేబ్‌లోకి.

రామ్మూర్తిని చూస్తూనే ఎండిన చెర్లో నీళ్ళు న్నాసిన కప్పల్లా, అప్పటి వరకూ అక్కడక్కడా వరండాలోనిల్చొని కబుర్లు చెప్పుగుంటూన్న స్టూడెంట్స్ అందరూ బిలబిల్లాడుతూ లోనికొచ్చేరు.

# ఎంబ్రాయిడరీ చేసి ఏవస్తువైనా సరే మనోహరంగా రూపొందించవచ్చు.

## ఆ ఎంబ్రాయిడరీని కోట్సు ఎంకర్ దారాలు సంవత్సరాలు గడచినా తళతళగా క్రొత్తగానే ఉంటుతాయి!



శ్రేష్ఠమైన ప్రతినుండి మాత్రమేలభ్యమయే తళతళలు, బలముతో కూడిన కోట్సు ఎంకర్ ఎంబ్రాయిడరీ దారాలు అద్భుతమైన, ఫలితాలనిస్తాయి. ఎన్నిసార్లు ఉతికినా సరే, చెక్కు చెదరకుండా తళతళగా శోభించే రకరకాల అందమైన, మనసుకు హత్తుకుపోయే ముదురు రంగులలోనుండి మీరు ఎన్నిక చేసుకోవచ్చు

కోట్సు ఎంకర్ అనేక ప్రయోజనాలుగలది చేతితోనూ, మెషీన్‌తోనూ కూడా ఎంబ్రాయిడరీ చేసేందుకుగాను అనేక రకాల ప్రత్యేకమైన దారాలు లభిస్తాయి. అంతే కాదు, కోట్సు ఎంకర్ ప్రచురణలలో భావనోద్దీపితమైన ఎన్నో క్రొత్త, క్రొత్త నమూనాలు కూడా! మీరు ఎంబ్రాయిడరీ చేసుకోవటానికి గానీ లేక ఎంబ్రాయిడరీ చేసిన వస్తువులను, బట్టలను కొనేటప్పుడు గానీ కోట్సు ఎంకర్ దారాలనే కోరండి





**ఎంకర్**

ఎంబ్రాయిడరీ దారాల ఉత్పత్తిదారులు

**కోట్సు**

ఉత్తమమైన దారములను ఉత్పత్తిచేయువారు

వెంకప్ప డిసెక్షన్‌కి సిద్ధంగా ఉంచిన కప్పన్ది తీసుకొచ్చి రామ్మూర్తి కెదురుగా బేసిన్లో పెట్టేడు.

అది పెద్దసైజులో బాగా బలిసి సరిగ్గా ఆవేళ రాధ మొదటిసారిచూసిజడుసుగున్న—కప్పలానేఉంది.

దాన్ని బేసిన్ నీళ్లలోని బోర్డుమీద ఫిక్స్‌చేసి, కత్తులూ కటార్లూ చేత బుచ్చుకోగానే కప్పబదులు రాధ మొహం కనబడి 'అయ్యొయ్యో అవేం భ్రష్టపు పన్లండీ ....' అంటున్నట్లనిపించింది.

అన్యమనస్కంగానే డిసెక్షనంతా పూర్తి జేసి పిన్‌తో పైకెత్తి చూపుతూ 'ఇదిగో స్టమక్' అన్నాడు.

'అది హార్ట్‌సార్' అని వో విద్యార్థి హెచ్చరించే వరకూ అతని కా పరధ్యానం వదల్లేదు.

తీరా చూస్తే అది హార్టే !

అర్ధాంగిని గూర్చి ఆలోచిస్తూ 'డైజెస్టివ్ సిస్టం'నికి బదులు 'హార్ట్‌సిస్టం' తీసవతల పెట్టేడు.

* * *

దీపాల వేళ.

చల్లగాలి కోసం డాబా పిట్టగోడమీద కూచుని పూలు మాలగట్టుగుంటూన్న రాధకి దూరాన్నించి స్పీడుగా సైకిల్ తొక్కుకుంటూ వస్తూన్న వ్యక్తి పరిచితుడుగా తర్జుమా ఐపోయేసరికి కొద్ది పరకా యుంచి చూసింది.

చూసిన మరుక్షణం ఉలిక్కిపడింది.

మాలకడూన్న చేతులగ్గూడా మతిబోయింది.

కడూన్న పూలచెండు నలాగే పట్టుగుని ఒక్క నిమిషంలోడాబాదిగి వీధిగేటు దగ్గరకొచ్చేసింది.

మరునిముషంలో చెమటలు కక్కుతూ ఆయాసంతో రొప్పుతూ రోజుతూన్న రామ్మూర్తి గూడా సైకిల్ దిగేడు గేటు దగ్గర.

'ఏమిటండీ.... మీరిలా.... అర్ధాంతరంగా. . .' రాధమ్మకి ఆశ్చర్యంతో ఆ తర్వాత మాటరాలేదు.

'నేను.... నేనొచ్చేశాను రాధా.... నీ కోసం వొచ్చేశేన్నేను....' అంతకంటె ఇంకేమీ మాట్లాడలేక పోయేడు రామ్మూర్తి.

# కప్పలు

యుగాల తర్వాత కల్సుగున్నట్లు ఒకర్నొకరు జూస్కుంటూ మాటామంతీలేకండా ఒకటి రెండు నిముషాలలా నిలబడిపోయేక తామిద్దరూ వీధిలో వున్నామన్న సంగతి గుర్తుకొచ్చి కెవ్వుమంది రాధ.

'రండి. . . .లోపలికి రండి' అంది కంగారుగా గేటు తెరుస్తూ.

'ఆషాడమో. . .ఆవకాయో' అంటూ ఆంక్షలు పెట్టేరుగా, లోనికి రావొచ్చా' అన్నాడు బెరుకుగా.

'ఫర్లేదులెండి. నాన్న కోర్టుపని మీద హైద్రాబాదెళ్లేరు. అమ్మగుళ్లోకెళ్ళింది. ఇంటో వుంది నేనొక్కర్తినే. ముందు లోపలికి రండి' అంటూలోనికి దారి తీసింది.

రామ్మూర్తి ధైర్యంగా అనుసరించేడు రాధమ్మని.

లోపలికొచ్చి తలుపులు మూస్తూనే రాతిలోంచి బయటపడ్డకప్పలా ఆమె వైపు గెంతేడు. తాళం 'కప్ప'లా కరుచుకు పోయేడు.

'నీకేం అమ్మ నాన్నల ఒళ్లోగువ్వలా కూచున్నావ్ హాయిగా. నేనెంత నరకం అనుభవిస్తున్నానో దెల్సా. నువ్విటొచ్చేసేక అన్నయ్యొచ్చి అమ్మన్దీసుకుపోయేడు. ఒంటరిగా తెల్లబోయేను.పిచ్చివాణ్ణయిపోయేను. కళ్ళు తెరచినా నువ్వే. మూసినా నువ్వే. తిండిలేదు. నిద్ర లేదు. ఏ పనీ చెయ్యబుద్ధికాదు. మెదడు మొద్దుబారి పోయింది. కలలో . . .యిలలో . . .మనసులో . . మెదడులో . . .అటూ . . .యిటూ . . .ఎడా . . పెడా అంతటానువ్వే. ఇవేళ స్కూలొదిలేక ఇంటికి పోబుద్ధిగాలేదు. దానికి తోడు బస్సులు స్ట్రైక్. ఒళ్ళు మండిసైకిల్ మీదొచ్చేశాను. . . .'రామ్మూర్తలా చెప్పుకుపోతున్నాడు.

రాధకి నోటమాట రాలేదు. అతని మాటలుగూడా వినబట్టం లేదు.

'నా కోసం పన్తులుండి గూడా పదివైళ్ళుసైకిల్ తొక్కుకుంటూ వచ్చేరా!'

ఆమె కళ్ళకి ఆ రాధాదాసుడు అపరతులసీదాసులా కనబడేడు. పట్టలేని ఆనందంతో, కృతజ్ఞతతోఆమె కళ్ళలో నీళ్ళు తిరిగేయి.

అలా కొంచెంసేపు తనివితీరా చూస్కుంటూ మనస్సువిప్పి మాట్లాడుగున్నాక, స్వల్పంగా అల్పాహారం సేవించి కాఫీ తాగేక హటాత్తుగా తెలివొచ్చి తనెంత"ఘనకార్యం"జేశేడోఅర్థమైందిరామ్మూర్తికి.

దాంతో కంగారు గూడాపుట్టింది.

'హయ్యయ్యో. . .ఇప్పుడెలా మీ అమ్మవొచ్చేస్తే.' ఆ మాట విన్నాక రాధగ్గూడా కంగారు పుట్టింది.

'ఏం పన్జేశారండీ మీరు. ఆవిడొచ్చేవేళగూడా ఐందీ . . .'

'నిన్ను తీసుగెళ్లిపోదామనివచ్చేను. అమ్మపది పదిహేను రోజుల తర్వాతగానీ రాదు. మిగతా రోజులు గూడా అక్కడే గడిపేస్తే ఈ ఆషాడంపీడ విరగడైపోతుంది గదా. ఆ విధంగా అమ్మకి వుత్తరంరాస్తాను. మనిద్దరం రేపు మనూరెళ్ళిపోదాం. మీ అమ్మకి నేనొచ్చినట్లు తెలీనీకుండా ఎవరిచేతో కబురుపంపేనని చెప్పి రేపొద్దున్నే బస్టాండుకు ఒక్కదానీ వొచ్చేయ్. ఈ రాత్రికి ఏ హోటల్లోనో వుంటాను. . .ఏం .'

ఎంత కంగారుగా జెప్పేడో అంత కంగారుగానూ విన్న రాధ అయోమయంగా తలూపింది.

'వొస్తాను మరీ ! పొద్దున్నే బస్టాండుకొచ్చేయ్!' అని చివరిసారిగాజెప్పి, చిన్నగా ముద్దుపెట్టి, వెళ్ళడానికి తలుపు తెరిచాడో లేదో . . .పురాణం విన్నొచ్చి తిరిగొచ్చిన అన్నపూర్ణమ్మగారు గేటు తీస్తూ అల్లుణ్ణిచూసి అలాగే నిలబడి పోయింది.

ఎటూ తప్పించుగోలేని పరిస్థితుల్లో పాము పాలబడిన కప్పలాకొయ్యబారిపోయేడురామ్మూర్తి.

> క్రూరమైన ఆషాఢ మాసం కబంధ హస్తాల్లో చిక్కుకుని ఎడబాటుకి గురై విరహ జ్వాలల్లో వేగిపోయే కొంగ్రొత్త జంటలకి — అంకితం.

యోగపరచుకోవచ్చునని అన్నాడు. అంతలోగా బినామీ దఖలుకు భూస్వాములు యత్నించవచ్చునని అన్నాడు ఆయన.

**మహావీరుడు సుబ్బారెడ్డి:**

తను నమ్మిన దాని కోసం పోరాడి, వైఫల్యం విరుచుకొని పడినప్పుడు, గుండె చెదరక మాతృసంస్థను వదలక సరయితన సైనికుడుగా క్రమశిక్షణను పాటించి ఎందరు ఎన్ని దూషణ తిరస్కారాలు కురిపించినా, కందే కాలునిలాగ మింగి మరల ప్రజా సేవకు నడుం కట్టి, కొనవూపిరి వరకు రాష్ట్రహితం కాంక్షించిన కాంగ్రెస్ కురువృద్ధుడు ఉపముఖ్యమంత్రి శ్రీ బొల్లవరపు వెంకటసుబ్బారెడ్డి. ఆయున జూన్ 7 వ తేదీ రాత్రి 8.15 కు గుండె పోటుతో మరణించారు. శ్రీ బి. వి.1903 జూలై 1 వ తేదీన పట్టుదలకూ, పౌరుషానికీ పుట్టినిల్లయిన కోయిలకుంట్లలో జన్మించారు. బందరు నోబెల్ కళాశాలలో చదివి 1926లో పట్టభద్రులై,

# హైదరాబాద్ నోట్‌బుక్

(5వ పేజీ తరువాయి)

మద్రాసు న్యాయకళాశాలలో బి. ఎల్. అయి నంద్యాలలో వకాల్తా ప్రారభించారు. కాంగ్రెసు సభ్యులూ అయ్యారు. జిల్లాబోర్డు అధ్యక్షులుగా 1938 లో కాంగ్రెస్ పక్షాన పోటీ లేకుండా ఎన్నికయ్యారు. 1941లో వైయక్తిక సత్యాగ్రహంలోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను మూడు నాలుగేళ్లు డిటెన్యూగా వున్నారు. 1955 నుండి శాసనసభ్యులు. 1962 లో శాసనసభ సభాపతిగా ఎన్నికయ్యారు. 1971లో ఉపముఖ్యమంత్రి అయ్యారు. 1972 డిసెంబరులో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఉద్యమంలో మంత్రివర్గం నుండి రాజీనామా యిచ్చారు. సభాపతిగా వివిధదేశాలు పర్యటించిపెక్కు అంతర్జాతీయ సమావేశాలలో భారత ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహించారు. ఎన్ని అభిప్రాయ బేదాలున్నా శ్రీ బి. వి. నాలుగు దశాబ్దాలకుపైగా దేశసేవచేసిన స్వాతంత్ర్య యోధుడన్నది, నిష్కర్షకు, నిష్పక్షపాతానికిపెట్టిన పేరన్నదీ ముమ్మాటికి నిజం.

**ఒక సవరణ:**

14—6—1974 నాటి సంచిక హైద్రాబాద్ నోట్‌బుక్‌లో "సురభారతి భవనానికి శంఖుస్థాపన" అన్న విషయం చివర "శ్రీమతి మండలి అనసూయ" అని పొరపాటు దొర్లింది. ఆమె శ్రీమతి వడలి అనసూయ, ఎం. ఎ.

**ఉపశ్రుతి:**

"వక్టెం నరసింహశాస్త్రిగారు 24 గంటలలో సంస్కృత భాగవతం పారాయణం చేసి ముగిస్తారు. తెలుసా?" అన్నాడొక పురాణాభిమాని. "భలే చెప్పినవులే, స్టాఫ్ వాల్యుయేషన్ — కాదు కాదు స్పాట్ వాల్యుయేషన్‌లో మూడు గంటలలో వంద ఏస్సర్ పేపర్లుకరెక్టు చేస్తుండగా చూడడంలేదా?" అన్నాడు ఒక ఆధునికుడు.

ఉదయం నా హృదయం

వచన కవితలు రచన : డాక్టర్ సి. నారాయణరెడ్డి, 64 పేజీలు, వెల 4 రూపాయలు. ప్రతులకు: ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు—మద్రాసు.

ఈ పుస్తకంలో ఉన్న 30 కవితలు అర్థవంత మైనవిగా, ఆలోచనలని రేకెత్తించేవిగా ఉన్నాయి. భావగంభీర్యం, పదలాలిత్యంతో కూడిన కవితలు

## అ పీ—ఇ పీ—అ స్పీ

అల్లడంలో డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రతిభా వ్యుత్పత్తులకి ప్రతిబింబం 'ఉదయం నా హృదయం.'

వి. సా. కథలు

విశాఖ సాహితి ప్రచురణ మా కార్యాలయం చేరింది. ఈ పుస్తకంలో అంగర వెంకట కృష్ణా రావు, 'మానస', మంగు రాజగోపాలరావు, మల్లాప్రగడ రామారావు, ఎ. వి. సీతారామమూర్తి, అంగర వెంకటశివప్రసాద్‌రావు, కృష్ణకుమారి, ఎస్. కాశీ విశ్వనాథం, తాతినేని వెంకటనరసింహారావు గార్ల కథలు ఉన్నాయి. 112 పేజీలు, వెల మూడు రూపాయలు. ప్రతులకు: విశాఖ సాహితి, 26—15—204, మెయిన్‌రోడ్, విశాఖపట్నం—1.





పద్మభూషణ్ శ్రీ బి. ఎన్. రెడ్డి అభినందన సంచిక

ఉత్తమ చలనచిత్ర అభిమానుల సంఘం తెనాలి వారు వెలువరించిన పద్మభూషణ్ శ్రీ బి. ఎన్. రెడ్డి అభినందన సంచిక మా కార్యాలయం చేరింది. ఇందులో దర్శకనిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డి గారిని గురించి ప్రముఖులనేకమంది వ్రాసిన వ్యాసాలు, పలు సందర్భాలలో తీసిన శ్రీ బి. ఎన్. రెడ్డిగారి ఛాయాచిత్రాలు ఉన్నాయి. 14.4.74న తెనాలిలో ఉత్తమ చలనచిత్ర అభిమానులసంఘం వారు శ్రీ బి. ఎన్. రెడ్డి గారిని సన్మానించిన సందర్భంలో దీనిని విడుదల చేశారు.

అంతరంగ చిత్రాలు

గేయ సంపుటి మా కార్యాలయం చేరింది. హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత విభాగానికి అధిపతియైన డాక్టర్ బి. ఆర్. శాస్త్రిగారు తెలుగులో కూర్చిన గేయాలు చక్కని పొందికైన పదాలతో, భావమధురిమతో కూడి ఉన్నాయి. 36 పేజీలు గల ఈ పుస్తకం వెల రూ. 1—80 పైలు. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాద్—మద్రాసు.

ఉబుసుపోక



మే 24 నుంచి 31 దాకా హైదరాబాద్‌లో జరిగిన చిత్రకళా ప్రదర్శనలో పలువురిని ఆకర్షించిన శ్రీ డి. మోహనరావు చిత్రం.

త్వరలో కొత్త సీరియల్
అతకని అనుబంధాలు












**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

అదృష్టవంతులండీ మీరు మా ఇందిరా గాంధీ చూడు రెస్టు కోసరం కాశ్మీరుకు పోవాలి.. మీకయితే ఎంచక్కా ఆఫీసు

ఇప్పుడే వస్తా
నా సీటు కొంచెం చూస్తూండు








PR మూర్తి

మీరడిగినట్టుగా ఇంక్రిమెంటిస్తాను - మరి మా అత్త గార్ని వాళ్ళవూరు పంపించి వస్తారా!

సంతోష
సగము
బలము

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA